# ఎల్లప్పుడూ ఆంప్రోనే!




కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.

ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు
ఆంప్రో® తో మీకు నాణ్యత ఖాయం.

Sista's-EIPL-60/87 TEL



# మిఠాయిల మహారాజు లోపలంతా చాక్‌లెట్ పెట్టి ఎక్లెయిర్‌లు బహూకరిస్తున్నాడు







# చాకొలెట్ ఎక్లెయిర్‌లు



బయట చూస్తే అది టాఫీ—మరి నోట్లో వేసుకుంటే నోరూరించే ప్యారీస్ చాకొలెట్‌గా మారిపోతుంది! ప్యారీస్ ఎక్లెయిర్‌లు అని అడగాలి



పూర్తిగా చాక్‌లెట్‌తో నిండిన ఎక్లెయిర్

నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:

కారమిల్స్ • ట్రై-మిా
చాకొలెట్ ఎక్లెయిర్స్
కోకోనట్ పంచ్
చాక్లెయిర్స్ • కోకోనట్ క్రీమ్
లాలీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్



70 సంవత్సరాలకుపైగా మిఠాయిలలో మొట్టమొదటి పేరు

PCL. 1830



గుర్తుండే ఉంటాయి మీకు మీ అమ్మ చెప్పిన అనుభవాలు. అప్పటి ఆడవాళ్లు ఆ అయిదు రోజులూ ఎలా గడిపేవారో, ఎలా ఆ పాతకాలపు బట్ట మడతల మీద భారం వేయవల్సి వచ్చేదో....అయితే ఇప్పుడు రోజులు మారాయి. ఈనాటి స్త్రీ సరైన శానిటరీ నేప్కిన్-అంటే కేర్‌ఫ్రీ లాంటిది వాడిందంటే ఏ పని కావాలంటే ఆ పని హాయిగా చేసుకోవచ్చు. కేర్‌ఫ్రీ ఎందుకు అంటారా!

**మరి కాలం మారుతోంది అలాగే మీరూనూ.**

ఈనాటి మీ ప్రపంచానికీ మీ అమ్మ చిన్ననాటి ప్రపంచానికీ ఎంతో తేడా ఉంది. మీరు ఆ అయిదు రోజులూ ఇంట్లో ఖైదీలా కూర్చో వీల్లేదు. ఏదో ఇబ్బందిగా ఉన్నట్టు అనుకో వీల్లేదు. అందుకే సరైన శానిటరీ నేప్కిన్ ఎంచుకుని రక్షణ పొందడం అంత ముఖ్యం.



**మారుతున్న ఈ కాలానికి కేర్‌ఫ్రీ ఎలా మంచిది!**

ఎందుకంటే కేర్‌ఫ్రీ ఆరోగ్య రీత్యా ఎంతో పరిశుద్ధమైనదిగా ఉండి మీకు పూర్తి రక్షణనిస్తుంది.

కేర్‌ఫ్రీలో చెమ్మ బాగా పీల్చుకునే పొరలున్నాయి. వీటి మూలంగా మీకు ఏమాత్రం చెమ్మ అనిపించకుండా సదా హాయిగా ఉంటుంది. ఋతుస్రావం ఎక్కువగా ఉన్న రోజులకోసం కేర్‌ఫ్రీ ఎక్స్‌ట్రా లార్జ్ ఉంది. మరింత పొడవు, వెడల్పు, దళసరితనమూ గల ఈ నేప్కిన్ మీరు కోరినప్పుడల్లా మరింత రక్షణ, మరింత ఆత్మవిశ్వాసం ఇస్తుంది.

కేర్‌ఫ్రీలోని మూడు ప్రక్కల ప్లాస్టిషీల్డ్ ధర్మమా అని కారడం, మరకలు పడడం జరగనే జరగదు. అంటే ఇకమీద సిగ్గుతెచ్చే ప్రమాదాలేవీ జరగవన్నమాట! అందుకే ఆ అయిదు రోజులూ కూడా నెలలో మిగతా రోజులలాగే అనిపిస్తుంది. మరి మీరింకా మామూలు నేప్కిన్‌లే వాడుతూ ఉంటే, కేర్‌ఫ్రీకి మారిపోవలసిన సమయం వచ్చినట్టు లేదూ! ఎందుకేమిటి! మారుతున్న కాలంతో బాటే మీరూ మారవద్దూ!

---

కేర్‌ఫ్రీ శానిటరీ నేప్కిన్స్— మారుతున్న ఈ కాలానికి పూర్తి హాయి, పూర్తి రక్షణ.

---




10 నేప్కిన్ల ప్యాక్‌లోనూ, పొదుపుగా 20 నేప్కిన్ల, 30 నేప్కిన్ల ప్యాకుల్లోనూ లభిస్తుంది.

# కేర్‌ఫ్రీ. ఎందుకంటే కాలం మారుతోంది. అలాగే మీరూనూ.

జాన్సన్ అండ్ జాన్సన్

OBM/9074/TEL/R




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''బ్రహ్మరాక్షసి ఆగ్రహం'']కు ఆధారం, మల్లవరపు మనోహరరెడ్డి రచన. కష్టాల్లో వున్నవాళ్ళకు సాయపడాలనే ధర్మగుణం చాలా మందిలో వుంటుంది. అయితే, ఎలాంటి సమయంలో, ఆ సాయం అందిస్తే, మనిషి కష్టాల నుంచి పూర్తిగా విముక్తి పొందగలడో గ్రహించడం చాలా అవసరం. ''జ్ఞాపకార్థం'' అన్న కథ, ఇందుకు మంచి ఉదాహరణ.

## అమరవాణి

గుణేషు క్రియతాం యత్నః, కిమాటోపైః ప్రయోజనం,
విక్రీయంతే న ఘంటాభిర్గావః, క్షీరవివర్జితాః.

[కృషిచేసి మంచి గుణాలను అభివృద్ధి పరచుకోవాలి. కేవలం పటాటోపం వల్ల ప్రయోజనం ఉండదు. పాలివ్వని ఆవును, మెడగంటలు చూసి ఎవరూ కొనరు కదా!]

సంపుటి 80 జూన్ '87 సంచిక 6

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

# హార్లిక్స్ బిస్కెట్ ఎంతో రుచి మరి
# దానిని తినే ఎలకకి చూపించండి దారి




హార్లిక్స్
బిస్కెట్స్

హార్లిక్స్ లోని పోషకాలు నిండిన కరకర గరగర బిస్కెట్!

HTA-5030 TEL

# శలుడు

సుశోభనా పరీక్షిత్తుల కుమారుడైన శలుడు గర్విష్ఠిగా పేరు పడ్డాడు. అతడొకనాడు వేటకు వెళ్ళి, ఒక జింకను పట్టుకోవాలని తరుమసాగాడు. అయితే, అతడెంతదూరం వెళ్ళినా, ఆ జింకను పట్టుకోలేక పోయాడు. పైగా అతడి రథాశ్వాలు బాగా అలిసిపోయాయి. అయినా, జింకను పట్టుకోకుండా వెనుదిరగడానికి అతని మనసు ఒప్పుకోలేదు. చుట్టుపక్కల కలయచూశాడు. కొంత దూరంలో ఒక ముని ఆశ్రమమూ, దాని సమీపంలో కట్టివేయబడి ఉన్న బలిష్ఠమైన రెండు గుర్రాలూ అతని కంటబడ్డాయి. ఆ ఆశ్రమం వామదేవు డనే మునిది.

శలుడు ఆశ్రమానికి వెళ్ళి, వామదేవుడికి భక్తితో నమస్కరించి తను వేటకు వచ్చిన విషయం చెప్పి, "స్వామీ, ఆ రెండు గుర్రాలను నాకు ఇవ్వండి," అన్నాడు వినయంగా.

"కావాలంటే గుర్రాలను తీసుకెళ్ళు. కాని, అరణ్యంలో నీ వేట పూర్తికాగానే వాటిని నాకు తిరిగి అప్పగించాలి, సమ్మతమేనా?" అని అడిగాడు వామదేవుడు.

"చిత్తం మునివర్యా, తప్పకుండా తెచ్చి అప్పగిస్తాను," అని, శలుడు గుర్రాలను పట్టి తన రథానికి పూన్చి, పారిపోయిన జింకపిల్లను మాత్రమే కాకుండా, మరి కొన్ని మృగాలను వేటాడి పట్టుకుని రాజధానికి బయలుదేరాడు.

ఆ సమయంలో వామదేవుడి శిష్యులు అతడి వెంటబడి, "రాజా, వేట పూర్తికాగానే, అశ్వాలను మా గురువుగారికి తిరిగి ఇవ్వగలమని మాట ఇచ్చారు కదా?" అని అడిగారు.

"బలమైన ఈ గుర్రాలను నేను ఇక ఇవ్వను. అయినా జపతపాలు చేసుకునే మీ గురువుగారి కెందుకు ఈ గుర్రాలు. కావాలంటే రాజధానికి వచ్చి, ఈ గుర్రాలకు బదులుగా, రెండు గోవులను తీసుకోమని మీ గురువుగారికి చెప్పండి," అని అమిత గర్వంతో గుర్రాలను అదిలించాడు శలుడు. మరుక్షణమే, రెండు గుర్రాలూ ఇద్దరు రాక్షసులుగా మారి, రథాన్ని తల్లకిందులు చేసి, కృతఘ్నుడై మాట తప్పిన శలుణ్ణి హతమార్చి, ముని ఆశ్రమానికి వెళ్ళిపోయాయి.





# గంగాజలం

చక్రధరపురంలో, పరంధాము డనే వడ్డీ వ్యాపారి వుండేవాడు. అతడికి ధనకాంక్ష ఎక్కువ. చక్రవడ్డీ పేరుతో, పేదసాదలను దారుణంగా దోచుకునేవాడు.

రంగనాధుడు, పరంధాముడికి ఒక్కగానొక్క కొడుకు. తండ్రి శిక్షణలో, వడ్డీ వ్యాపారంలోని మెలుకువలు నేర్చుకుని, అతడు కూడా జనాన్ని కష్టాలపాలు చేయసాగాడు.

పరంధాముడికి ఉన్నట్టుండి, పక్షవాతం వచ్చి, కాళ్ళూ, చేతులూ పడిపోయాయి. వైద్యం చేయించుకోవడం, అతడికి యిష్టం లేకపోయింది. అదంతా వృధావ్యయం అని, అతడి ఉద్దేశం.

అయితే, రంగనాధుడికి, తండ్రి అంటే ఎంతో ప్రేమ. అతడు మంచి వైద్యులచేత తండ్రికి వైద్యం చేయించాడు. అయినా, ప్రయోజనం లేకపోయింది.

ఈ పరిస్థితుల్లో, చక్రధరపురానికి, కారుణ్యుడు అనే యోగి వచ్చాడు. ఆయన ఎంతో జ్ఞానసంపన్నుడనీ, మహిమలు గలవాడనీ తెలిసి, గ్రామస్థులు ఆయన దర్శనం చేసుకోసాగారు.

రంగనాధుడు కూడా, కారుణ్యుణ్ణి దర్శించి, తన తండ్రి పరిస్థితి చెప్పి, "స్వామీ, నా తండ్రికి స్వస్థత కలిగే మార్గం సెలవీయండి!" అని ప్రార్థించాడు.

కారుణ్యుడు, కళ్లు మూసుకుని తెరిచి, "నీ తండ్రి, వడ్డీవ్యాపారంలో, అనేకులను సర్వనాశనం చేసిన పాపి. కాశీవిశ్వేశ్వరుణ్ణి దర్శించి, గంగాజలం సేవిస్తే, వ్యాధి నయమవుతుంది," అన్నాడు.

అందుకు రంగనాధుడు దీనంగా, "మంచంలో కదలలేని స్థితిలో వున్న, నా తండ్రి అంత దూరం ప్రయాణం చేయడం, అతి కష్టతరం గదా!" అన్నాడు.

ఎస్. శివనాగేశ్వరరావు



''అయితే, నీవు కాశీకి పోయి, విశ్వేశ్వరుణ్ణి పూజించి, గంగాజలం తీసుకురా. ఆ జలం తాగితే, నీ తండ్రికి మేలు కలగవచ్చు,'' అని చెప్పాడు కారుణ్యుడు.

రంగనాధుడు కాశీ ప్రయాణానికి సన్నాహాలు చేయసాగాడు. అది చూసి పరంధాముడు అభ్యంతరం చెబుతూ, ''నేని జబ్బుతో మంచాన వున్నాను. నువ్వు కాశీకి పోతే, మన వడ్డీవ్యాపారం మూలబడుతుంది,'' అన్నాడు.

''నాన్నా, నిన్ని స్థితిలో చూస్తూండడం, నాకు దుఃఖకారణం. కాశీకి వెళ్ళి, వీలైనంత త్వరలో తిరిగి వస్తాను,'' అని చెప్పి, రంగనాధుడు ప్రయాణమయ్యాడు.

అతడు కాశీ చేరి, విశ్వేశ్వరుడి దర్శనం చేసుకుని, గంగానదిలో శుచిగా స్నానం చేసి, ఒక రాగిపాత్రలో గంగాజలం నింపుకుని, తిరుగు ప్రయాణమయ్యాడు.

రంగనాధుడు మార్గమధ్యంలో, ఒక చిట్టడవిగుండా ప్రయాణం చేస్తూండగా, పిపీలికం అనే పిశాచం, అతడి ముందు ప్రత్యక్షమైంది. దాన్ని చూసి, రంగనాధుడు వణికిపోసాగాడు.

పిపీలికం, అతడితో, ''భయపడకు! నేను మేలు చేసే పిశాచాన్నేగాని, కీడు చేసేదాన్ని కాదు. నీకేమైనా సహాయం కావాలా?'' అన్నది.

రంగనాధుడు భయం నుంచి తేరుకుని, ''నీవు, నాకు చేయగల సహాయం ఏమీ లేదు. కాశీ వెళ్ళి పవిత్ర గంగాజలం పట్టుకొస్తున్నాను. దీనితో, నా తండ్రి పక్షవాతం నయం చేయాలి,'' అన్నాడు.

ఆ వెంటనే పిశాచం, అతడికి నమస్కరించి, ''మానవోత్తమా! దయచేసి, ఆ గంగాజలం, నాకు కొంచెం ప్రసాదించు. నాకు విముక్తి లభిస్తుంది,'' అన్నది.

''నేనెన్నో వ్యయప్రయాసలకు గురై, ఈ గంగాజలాన్ని తెచ్చింది, నీలాంటి పిశాచాలకు యివ్వడానికి కాదు. దారి తప్పుకో!'' అంటూ రంగనాధుడు ముందుకు కదిలాడు.

పిశాచం, అతడి వెనకగా నడుస్తూ, ''గంగానదిలో స్నానం చేసి, ఆ పవిత్ర జలాన్ని తెస్తున్న మీరెంతో పుణ్యాత్ములు. మీ పాదధూళివల్లనైనా, నాకు పాపపరిహారం జరగవచ్చు.'' అంటూ వంగి, రంగనాధుడి పాదముద్ర పడినచోట వున్న మట్టిని తీసుకుని, కళ్ళకద్దుకుని, భక్తితో తల మీద జల్లుకున్నది.

ఆ మరుక్షణం, ఎపీలికానికి పిశాచ రూపం పోయి, తెల్లని బట్టల్లో వున్న స్త్రీమూర్తి, రంగనాధుడికి కృతజ్ఞతలు చెప్పుకుని, అదృశ్యమైపోయింది.



రంగనాధుడు, ఈ జరిగినదానికి ఆశ్చర్యపోతూ, మరికొంత దూరం వెళ్ళేసరికి, అతడికి ఒక దృఢకాయుడు ఎదురయ్యాడు. వాడు, ఒక చిన్న చక్రాల బండిలో, ఒక బాలుణ్ణిలాక్కువస్తున్నాడు.

వాడు, రంగనాధుడికి నమస్కరించి, ''అయ్యా, నేను మీకు చేయగల సాయం ఏమైనా వున్నదా ?'' అని అడిగాడు.

''సాయమా! ఎవరివి నువ్వు!'' అని ప్రశ్నించాడు రంగనాధుడు.

''అయ్యా, నా పేరు రుధిరోష్ఠుడు. ఒకప్పుడు పేరు మోసిన గజదొంగను. నేను చేసిన పాపాలకు శిక్ష ఏమో—నా కొడుకు కుష్టువ్యాధికి గురి అయ్యాడు. నేను దొంగతనాలు మాని, మీవంటివారికి సాయపడుతూ, పాపఫలం కొంత తగ్గించుకుంటున్నాను,'' అన్నాడు దృఢకాయుడు.

రంగనాధుడు, ''నీ సాయమేమీ అవసరం లేదు. నన్ను పోనీ!'' అన్నాడు.

రుధిరోష్ఠుడు, అతడి చేతిలోని రాగి పాత్రను చూస్తూ, ''అంత జాగ్రత్తగా పట్టుకున్నారు. ఆ పాత్రలో ఏమున్నది?'' అని అడిగాడు.

''పవిత్ర గంగాజలం! దానితో, నా తండ్రి పక్షవాతాన్ని నయం చేయాలి,'' అని జవాబిచ్చాడు రంగనాధుడు.

''అయ్యా, అందులో కొద్ది జలాన్ని, నా కొడుకిక్కివ్వండి. వాడివ్యాధి నయం కావచ్చు,'' అని కోరాడు రుధిరోష్ఠుడు.



గజదొంగ, రంగనాధుడికి సాష్టాంగ నమస్కారం చేసి, ''అయ్యా, తమ మేలు ఎన్నటికీ మరవను!'' అన్నాడు.

రంగనాధుడు ఇల్లు చేరగానే, తండ్రికి జరిగినదంతా చెప్పి, ''గంగానదిలో స్నానం చేయడం వల్ల, నాకెంతో పుణ్యం వచ్చింది. అందువల్లనే, నా పాదధూళి తగలగానే, పిశాచానికి విముక్తి లభించింది. ఒక్క చుక్క గంగాజలంతో, గజదొంగ కొడుక్కు కుష్ఠువ్యాధి నయమైంది. ఆ పవిత్రజలాన్ని నీచేత తాగించబోతున్నాను. నాన్నా, నీ జబ్బు తప్పక నయమైపోతుంది!" అని, రాగిచెంబులోని గంగాజలం కొంత తండ్రి చేత తాగించాడు.

అది తాగిన పరంధాముడికి, కాళ్ళూ, చేతులూ స్వాధీనంలోకి రావలసింది పోయి, నోటిమాట కూడా పడిపోయింది. ఎంత ఆలోచించినా, రంగనాధుడికి, అలా ఎందుకు జరిగిందో అర్థం కాలేదు.

వారం రోజుల తర్వాత, కారుణ్యుడు దక్షిణదేశయాత్ర ముగించుకుని తిరిగి పోతూ, చక్రధరపురంలో ఆగాడు.

రంగనాధుడు, ఆయన దర్శనం చేసుకుని, తాను కాశీకి వెళ్ళడం, తిరిగి వచ్చేటప్పుడు కలిగిన అనుభవాలూ చెప్పి, ''స్వామీ, ఆ పవిత్ర గంగాజలం తాగిన, నా తండ్రికి వ్యాధి నివారణ కాకపోగా,

రంగనాధుడు కోపంగా, ''ఎన్నో కష్టాల కోర్చి, ఈ జలాన్ని తెచ్చింది, నీ వంటి గజదొంగలకు దానం చేయడానికి కాదు!'' అన్నాడు, వేగంగా అడుగులు వేస్తూ.

ఆ సమయంలో, రాగిపాత్రలోని గంగాజలం తొణికి, ఒక చుక్క నేల మీద పడింది. అది గమనించిన రుధిరోష్ఠుడు, ''ఈ పవిత్ర జలం, ఒక చుక్క తగిలినా, నా కొడుకు వ్యాధి నయం కావచ్చు!'' అంటూ, నీటిచుక్క పడినచోట వున్న మట్టిని గుప్పెట్లోకి తీసుకుని, దానిని కొడుకు శరీరానికి పూశాడు.

ఆ మరుక్షణం, గజదొంగ కొడుకు శరీరం పచ్చటి కాంతితో ప్రకాశించింది.

నోటమాట కూడా పడిపోయింది. ఇలా ఎందుకు జరిగింది?'' అని అడిగాడు.

దానికి కారుణ్యుడు, ''పిశాచి పిపీలికం, గజదొంగ రుధిరోష్ఠుడూ, తాము చేసినవి పాపాలని గ్రహించి, పశ్చాత్తాప పడ్డారు. చేతనైనంతలో యితరులకు సాయపడ్డారు. అందువల్ల, వారికి మేలు జరిగింది. నువ్వు మాత్రం, నీ తండ్రి ఒక్కడికే మేలు జరగాలన్న స్వార్థబుద్ధితో ప్రవర్తించావు. నీ తండ్రి వడ్డీ వ్యాపారంతో, ఎన్నో కుటుంబాలను సర్వనాశనం చేశాడు. రోగగ్రస్తుడయిన తర్వాత కూడా, చేసిన పాపాలకు పశ్చాత్తాపపడలేదు. ఆ కారణంగా, గంగాజలం అతడికి స్వస్థత చేకూర్చలేకపోయింది,'' అన్నాడు.

''స్వామీ, వడ్డీ వ్యాపారం, మా వృత్తి. అటువంటప్పుడు, ఆ వ్యాపారం చేసిన నా తండ్రి పాపి ఎలా అవుతాడు?'' అని రంగనాధుడు, సాధువును ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న విన్న కారుణ్యుడు చిన్నగా నవ్వి, ''చేసే వృత్తిలో, న్యాయాన్యాయాలనేవి వున్నవి. మీరు ప్రజల దగ్గిర ధర్మ వడ్డీ కాక, అక్రమంగా హెచ్చువడ్డీలు వసూలు చేశారు,'' అన్నాడు.

రంగనాధుడు, కారుణ్యుడికి సాష్టాంగ నమస్కారం చేసి, ''స్వామీ, నాకు జ్ఞానభిక్ష పెట్టారు,'' అని, ఇల్లు చేరి, రాగి చెంబులోని గంగాజలాన్ని, ఊరిలోని రోగులందరకూ పంచి పెట్టాడు. అక్రమంగా వడ్డీ వ్యాపారంలో గడించిన ధనాన్ని పేదసాదలకు దానం చేసి, ధర్మ వడ్డీ మీద వ్యాపారం ప్రారంభించాడు.

కారుణ్యుడు చెప్పినదంతా, కొడుకు ద్వారా విన్న పరంధాముడు పశ్చాత్తాప పడడమేగాక, అతడు చేస్తున్న ధర్మవడ్డీ వ్యాపారం చూసి చాలా సంతోషించాడు. ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే అతడికి వ్యాధి నిమ్మళించి మాట కూడా వచ్చింది.

మంచితనం, మానవత్వం గంగా జలం కన్న పవిత్రమైనవని గ్రహించిన, తండ్రీ కొడుకులు, త్వరలోనే నీతిమంతులన్న పేరు తెచ్చుకున్నారు.






చిదానందుడు, రత్నపురాన్ని పాలిస్తున్న రత్నగుప్తుని, ఆస్థాన విదూషకుడు. అతడు తన సరస హాస్యోక్తులతో, రాజుకు ఎంతో ఉల్లాసాన్ని కలిగించడమే కాకుండా, అనేక విషయాలలో చక్కని సలహాలిస్తూ, గొప్ప మేధావిగా కూడా పేరు పొందాడు. అందువల్ల, రాజు అభిమానించే అత్యంత ప్రముఖ వ్యక్తుల్లో, చిదానందు డొకడయాడు.

దూరగ్రామంలో వుంటున్న చిదానందుడి బావమరిది, మోహనసింహుడనే అతడికి, తన బావగారి పలుకుబడితో, రాజాస్థానంలో ఉద్యోగం సంపాయించాలన్న ఆలోచన వచ్చింది. అతడు రాజధానికి వచ్చి, బావకు ఆ సంగతి చెప్పాడు. చిదానందుడికి, మోహనసింహుడి తెలివితేటల మీదా, లోకజ్ఞానం మీదా అంతగా నమ్మకం లేదు.

అతడు, బావమరిదితో, ''నేను చెప్పినంత మాత్రాన రాజుగారు, నీకు ఉద్యోగం యివ్వడు. సామర్థ్యం, సమయస్ఫూర్తి, తెలివితేటలూ వున్నవాళ్ళకు మాత్రమే, రాజాస్థానంలో ప్రవేశం లభిస్తుంది.'' అన్నాడు.

''అయితే, నువ్వనే సామర్థ్యం వగైరా నిరూపించుకుంటాను. నన్నొకసారి రాజుగారి దగ్గరకు తీసుకుపో,'' అని కోరాడు మోహనసింహుడు.

''నిన్ను రాజుగారి దగ్గరకు తీసుకుపోవడం, అంత కష్టమేమీ కాదు. కాని, నీ తెలివితేటలు రాజుగారి ముందు అక్కరకు రాగలవన్న నమ్మకం, నాకు లేదు,'' అన్నాడు చిదానందుడు.

దానితో మోహనసింహుడి ఆత్మాభిమానం దెబ్బతిన్నది. అతడు చిరుకోపంతో, ''బావా! ఇదే నీకూ, నాకూ పందెం!''

యండపల్లి పాండురంగ

అని, ఒక విచిత్రమైన పందెం వేశాడు చిదానందుడితో.

ఆ పందెం విని, చిదానందుడు ఆశ్చర్య పోయాడు. బావమరిదికి ఏం జవాబు చెప్పాలో, అతడికి తెలియలేదు. మౌనంగా తలాడించాడు.

మర్నాడు మోహనసింహుణ్ణి, రాజు పద్దకు తీసుకుపోయాడు చిదానందుడు. ఆ సమయంలో, రాజు సేవకుడి నుంచి, చిన్న పాలలోటాను అందుకుంటున్నాడు. చిదానందుడు రాజుకు నమస్కరించి, మోహనసింహుణ్ణి, తన బావమరిదిగా పరిచయం చేశాడు.

వెంటనే మోహనసింహుడు, రాజుకు నమస్కరించి, "ప్రభూ, తమరా పాలను ఎప్పుడూ నోటితోనే తాగుతారా?" అని అడిగాడు.

రాజుకు ఆశ్చర్యంతోపాటు ఆగ్రహం కూడా కలిగింది. ఆయన కోపంగా, "పాలను నోటితో కాక, ముక్కుతో తాగుతారా?" అన్నాడు.

"క్షమించండి! తమరు పందెం వేస్తే, ఆ పాలను నేను ముక్కుతో తాగగలను," అన్నాడు మోహనసింహుడు.

రాజుకు, ఆ మాటలు తమాషాగా తోచి, "సరే, పందెం ఎంత?" అని అడిగాడు చిన్నగా నవ్వుతూ.

అందుకు మోహనసింహుడు వినయంగా, "ప్రభూ, నేను నిరుద్యోగిని. నా దగ్గిర ఒక్క వెండి రూపాయి మాత్రమే



వున్నది. దాన్ని పందెంగా ఒడ్డుతాను,'' అన్నాడు.

రాజు అందుకు ఒప్పుకుని, తన చేతి లోని పాలలోటాను, మోహనసింహుడికి యిచ్చాడు.

మోహనసింహుడు పాలను నోటితో గడ గడ తాగి, ''ప్రభూ, నేను ఓడిపోయాను!'' అంటూ, వెండి రూపాయిని ఆయన ముందు పెట్టాడు.

ఇది చూసి రాజు పెద్దగా నవ్వసాగాడు. వెంటనే చిదానందుడు, మోహనసింహుడి భుజం తట్టి, ''ఔరా, మోహనసింహా! నిజంగానే నీ తెలివితేటలు అమోఘం,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యంగా, చిదానందుడి కేసి చూశాడు. అప్పుడు చిదానందుడు, ''ప్రభూ, తమరు క్షమిస్తానంటే, ఒక చిన్న విషయం మనవి చేసుకుంటాను,'' అన్నాడు.

''ఏమిటది?'' అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

చిదానందుడు, తన బావమరిది రాజధానికి వచ్చిన పని గురించి వివరంగా చెప్పి, ''తమ ఆస్థానంలో ఉద్యోగం దొరకాలంటే, యితరుల పలుకుబడివల్ల సాధ్యపడదనీ, స్వతహాగా తెలివితేటలూ, సమయస్ఫూర్తి ఉండాలనీ చెప్పాను. దానితో నా బావమరిది, ఒక విచిత్రమైన పందెం వేశాడు. అదేమిటంటే—రాజుగారిని మనం దర్శించబోయిన సమయంలో, ఆయన ఏ పాలో, మంచినీరో తాగబోతున్నారనుకో. అప్పుడు నేను, ఒకే ఒక వెండి రూపాయతో, వాటిని తాగుతాను. అదీ రాజుగారు స్వయంగా నా కందించి నప్పుడు! ప్రభూ, పందెంలో, నా బావ మరిది నెగ్గినట్టే గదా,'' అన్నాడు.

రాజు చిరునవ్వునవ్వి, ''నెగ్గకేం! మనిషి తన తెలివితేటలతో, దేన్నయినా సాధించవచ్చుని, నీ బావమరిది మరొక సారి నిరూపించాడు,'' అని, మోహన సింహుడికి అప్పటికప్పుడే, ఆస్థానంలో తగిన ఉద్యోగం యిచ్చాడు.






# 14

[చిత్రసేనుడు తను వాగ్దానం చేసిన ప్రకారం ఉగ్రాక్షుడికి తన ప్రథమ సంతానాన్ని యివ్వకుండా, ఇతర్ల పిల్లల్ని యిచ్చాడు. అయితే, ఉగ్రాక్షుడు ఈ మోసం గ్రహించాడు. చివరకు చిత్రసేనుడు తన పిల్లవాణ్ణి ఉగ్రాక్షుడి పరం చేశాడు. ఉగ్రాక్షుడు ఆ పిల్లవాడికి ఉగ్రదత్తుడని పేరు పెట్టి, మరిద్దరు కుర్రవాళ్ళతో, అతణ్ణి తన కోటలో పెంచసాగాడు. తరవాత—]

ఐదేళ్ళ వయసు వరకూ, రాజభోగాలతో సుకుమారంగా పెరిగిన చిత్రసేనుడి కుమారుడు, రాక్షసుడైన ఉగ్రాక్షుడి కోటలో ఉగ్రదత్తుడనే పేరుతో పెరగసాగాడు. అతడికి తోడుగా వుంటూ ఆటపాటల్లో పాల్గొనేందుకు దొంగిలించుకు రాబడిన పల్లెబాలురకు, ఉగ్రాక్షుడు రుద్రుడు, ఆరుద్రుడు అని పేర్లు పెట్టాడు. ఈ ముగ్గురూ రాక్షసుల నడుమ తతిమ్మా రాక్షస బాలురతోపాటు పెరిగి పెద్దవారవుతున్నారు.

రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలూ గడిచిపోతున్నై. చూస్తూండగానే పదిహేను సంవత్సరాలు గిర్రున తిరిగినై. ఉగ్రాక్షుడు తన నాయకత్వం కింద వున్న రాక్షసులను హింసావృత్తి మాన్పి నాగరికులను చేసేందుకు, వాళ్ళచేత అడవి నరికించి వ్యవసాయపు పనులు చేయించ



సాగాడు. కాని, వాళ్ళకు భూములు దున్నేందుకూ, పండిన పంటలను ఇళ్లకు చేర్చేందుకూ మామూలు ఎడ్లూ, దున్నపోతులూ పనికి రాలేదు. మహాకాయులూ, బలశాలులూ అయిన వాళ్ళ చేతుల్లో, మనుషులు ఉపయోగించే ఈ పశువులు ఎందుకూ అక్కరకు రాకుండాపోయినై. ఆ కారణం చేత వాళ్ళు ఏనుగులనూ, ఒంటెలనూ, ఖడ్గమృగాలనూ నాగళ్లకూ, బండ్లకూ కట్టి వ్యవసాయపు పనులు చేయసాగారు. ఇది అడవిలో వున్న గ్రామాల్లో నివసించే ప్రజలకు ఎంతో ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ కలిగించింది. రాక్షసులు నరమాంస భక్షణా, గ్రామాల మీద పడి పశువులను దొంగిలించుకుపోవటం మాని, ఈ విధంగా వ్యవసాయదారులైనందుకు వాళ్ళెంతగానో సంతోషించారు. ఈ అన్ని కారణాలవల్లా చిత్రసేనుడు పాలిస్తున్న కపిలపుర రాజ్యం సర్వ సంపదలతో తులతూగ సాగింది.

ఇప్పుడు ఉగ్రదత్తుడూ, అతడి చెలికాళ్ళయిన రుద్రారుద్రులూ ఇరవై ఏళ్ళు నిండిన నవయవ్వనులు. వాళ్ళు కత్తిసామూ, గుర్రపుస్వారీ, ఈటె విసరటం, ధనుర్బాణాలు ప్రయోగించటంలో గొప్ప నిపుణులయ్యారు. వాళ్ళు ఒకనాడు ఉగ్రాక్షుడి ద్వారా ఒకప్పుడు కపిలపుర రాజ్యంలో పెద్ద సంక్షోభం కలిగించిన, జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళను గురించి విన్నారు.

"ఈనాటికీ ఆ పులిరాయుళ్ళు భయంకర పక్షుల మీద ఎక్కి, అప్పుడప్పుడూ రాత్రివేళల మన రాజ్యంలో కనిపిస్తూ వుంటారు. గత పదిహేను సంవత్సరాలుగా వాళ్ళు రాజ్యంలో చేసిన దుండగం ఏమీ లేదు. వాళ్ళ నాయకుడిగా యిక్కడికి వచ్చిన కరవీరుడూ, ద్రోహి నాగవర్మ మనకు చిక్కకుండా పారిపోయారు." అని చెప్పాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడి ఈ మాటలూ, హెచ్చరికా ఉగ్రదత్తుడి మనసులో బాగా హత్తుకు

పోయినై. ద్రోహి నాగవర్మా, అతని అనుచరుడు కరవీరుడూ జ్వాలాద్వీపంలో వున్నారో లేదో అన్న సంగతి యిదమిత్థంగా తెలుసుకుంటే తప్ప, రాజ్యానికి క్షేమం లేదని అతడు నిర్ణయించుకున్నాడు. ఈనాటికీ రాజ్యంలో జ్వాలాద్వీప వాసులు అప్పుడప్పుడూ కనిపిస్తూ వున్నారంటే— దాని అర్థం ఆ క్రూరులు ఈ కపిలపుర రాజ్యాన్ని గురించి పూర్తిగా మరిచిపోలేదన్నమాట.

ఉగ్రదత్తుడు తన స్నేహితులైన రుద్రారుద్రులతో సంప్రదించి ఒక పథకం వేశాడు. అదేమిటంటే, రాజ్యంలో రాత్రి వేళల చెదురుగా అక్కడా యిక్కడా కనబడే జ్వాలాద్వీప వాసుల్లో ఒకణ్ణి ప్రాణాలతో పట్టుకోవటం. అలా ఒకడు దొరికిననాడు వాడి ద్వారా ప్రస్తుత జ్వాలాద్వీపపు స్థితిగతులు తెలుసుకోవచ్చు. ద్రోహి నాగవర్మా, కరవీరుడూ సజీవులో కాదో గ్రహించవచ్చు.

ప్రాణాలతో ఒక జ్వాలాద్వీపపు పులిరాయుణ్ణి పట్టుకోవాలంటే, అరణ్యంలో వున్న ప్రజలూ, రాక్షసులూ సహకరించాలి. ఏదైనా పెద్ద బహుమానం ప్రకటిస్తే వాళ్ళు అన్నిటికీ తెగించి, రేబవలు కాపలా వేసి, ఒక్క పులిరాయుణ్ణయినా తప్పక పట్టుకు తీరుతారు.



ఉగ్రదత్తుడు ఈ విషయం తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడితో మాట్లాడాడు. ఉగ్రాక్షుడు వెంటనే అంగీకరించాడు. "పులిరాయుణ్ణి ప్రాణాలతో పట్టి తెచ్చినవాళ్ళకు ఒక లక్ష బంగారు కాసులు యిస్తామని చాటింపు వేయించు. పోయిందేమిటి? మన కోటలోని నేల మాళిగలలో బంగారం మూలుగుతున్నది," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రదత్తుడు అడవిలోని జనవాసాల్లో రాక్షసులు నివసించే కొండ చరియల్లో చాటింపు వేయించాడు. అది మొదలు రోజూ జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళను గురించిన సమాచారం ఉగ్రాక్షుడి కోటకు



స్వయంగా రాత్రివేళల్లో అడవిలోకి పోయి, ఏదో ఒక ఎత్తయిన ప్రదేశాన్నుంచి కాపలా కాయాలి. ఉగ్రదత్తుడు యీ నిర్ణయానికి రాగానే, రుద్రుడూ, అరుద్రుడూ కూడా అతడి వెంట వచ్చేందుకు ఉత్సాహం కనబరిచారు. ఒకనాటి సూర్యోదయం వేళ ముగ్గురూ కోట వదిలి గుర్రాల మీద అరణ్యంలోకి బయలుదేరారు. వాళ్ళు జనులు నివసించే గ్రామాలను వదిలి, నిర్జనంగా వుండే అరణ్య ప్రాంతాల వెంట నడిరేయివరకూ ప్రయాణం చేశారు.

తెలియవస్తూండేది. పులిరాయుళ్ళు తమ భయంకర పక్షుల మీద ఎక్కి రాత్రివేళ రాజ్యంలో చాలా చాలా ప్రదేశాల్లో కనిపిస్తున్నారు. కాని, ఎక్కడా వాళ్ళు కిందికి దిగటం లేదు.

ఈ రకమైన వార్తలు ఉగ్రదత్తుణ్ణి నిరుత్సాహపరిచినై. పులిరాయుళ్ళు రాజ్యంలో ఎలాంటికల్లోలం కలిగించాలనే ప్రయత్నంలో, ఈ విధంగా రాత్రివేళల వేగు వస్తున్నారో అతడికి అర్థం కాలేదు. ఒకవేళ ఆ క్రూరులు ప్రజల కంటబడకుండా, ఏ మారుమూల నున్న అడవి ప్రాంతాల్లోన్నయినా కిందికదిగుతున్నారా? ఈ అనుమానం తీరాలంటే తనే

ఆసరికి ముగ్గురూ అలసిపోయారు. గుర్రాలు బాగా దస్సిపోయి వున్నాయి. తెల్లవారేవరకూ అక్కడ వున్న ఒక దేవదారు వృక్షం కింద విశ్రాంతి తీసుకోవాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. ముగ్గురూ గుర్రాలు దిగి, వాటిని విడివిడిగా చెట్లకు కట్టివేసి, తాము పడుకో దలుచుకున్న చెట్టు కిందికి వచ్చేసరికి, చెట్టు పైభాగమంతా వెలుగుతో మెరిసిపోవటం వాళ్ళ కంటబడింది.

అందరికన్న ముందు తల విత్తి చూసిన ఉగ్రదత్తుడు, ఎక్కడ లేని ఆశ్చర్యంతో, "భయంకరపక్షి! దాని మీద వున్న పులిరాయుడి చేతిలో వెలుగు నిస్తున్న వస్తువేదో వున్నది." అన్నాడు.

రుద్రారుద్రులు కూడా తలలు ఎత్తి చూశారు. అసరికి భయంకరపక్షి పడమటి దిశగా చాలా దూరం వెళ్ళిపోయింది. వాళ్ళు కూడా పక్షి పోతున్న వైపు నుంచి వెలుగు రావటం గమనించారు.

"నేను ఈ దేవదారు చెట్టు చివారు కొమ్మకు ఎక్కి, మనం ప్రస్తుతం ఎలాంటి పరిసరాల్లో వున్నామో చూస్తాను." అన్నాడు రుద్రుడు.

ఇందుకు ఉగ్రదత్తుడూ, అరుద్రుడూ సరేనన్నట్టు తలలు వూపారు.

రుద్రుడు దేవదారు చెట్టు పైకి గబగబా పాకిపోయి, కొద్దిసేపటికల్లా వగరుస్తూ కిందికి దిగి వచ్చాడు.

ఉగ్రదత్తుడు ప్రశ్నించే లోపలే రుద్రుడు పడమటి దిక్కు కేసి చెయి వూపుతూ, "ఇక్కడికి దాపులనే ఎవరిదో పెద్ద కోట వున్నది. కోటలో ఎక్కడా వెలుగు లేదు. బురుజుల మీద ఎవరూ కాపలా వున్న సూచనలు కూడా కన బడటం లేదు." అన్నాడు.

రుద్రుడి మాటల్లోని అదుర్దా గమ నించిన ఉగ్రదత్తుడు, "అయితే, నీ అభి ప్రాయం, పులిరాయుళ్ళు ఆ కోటలో ఏమైనా దిగి వుంటారనా?" అని అడిగాడు.

"ఆ సంగతి తేల్చి చెప్పటం కష్టం. ఆ కోటలో వుంటున్న వాళ్ళెవరైనా—




వాళ్ళు ఏమాత్రం జాగ్రత లేకుండా వుంటున్నారన్నదే నా వుద్దేశం. ఇంతకు ముందు మనం చూసిన పులిరాయుడు, ఆ కోటలోగాని దాని పరిసరాల్లోగాని దిగి వుంటే, చూసి హెచ్చరిక చేసే నాయు డెవడూ వున్నట్టు లేదు." అన్నాడు రుద్రుడు.

రుద్రుడికి కలిగిన సంశయం లాంటిదే ఉగ్రదత్తుడి కూ్కడా కలిగింది. తన కోట రక్షణను గురించి యింత నిర్లక్ష్యంగా వుంటున్న, ఈ కపిలపురం సామంతు డెవడా అని అతడు కొంచెంసేపు ఆలోచిం చాడు. తెల్లవారితేగాని, ఈ ప్రశ్నకు జవాబు దొరకదు. సూర్యోదయంతోపాటే లేచి,



తాను మొట్టమొదటగా చేయవలసిన పని ఈ సామంతరాజుకు, పులిరాయుళ్ల నుంచి రాబోయే ప్రమాదాన్ని గురించి చెప్పి, హెచ్చరించటం.

తరవాత కొద్ది సేపటికల్లా ప్రయాణ బడలికతో నీరసించి వున్న ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులూ చెట్టు కింద ఒళ్ళు మరిచి నిద్రపోయారు. సూర్యోదయం కాగానే అడవిలో జంతువులూ, పక్షులూ చేసే కలకలం వింటూనే వాళ్ళ గుర్రాలు పెద్దగా సకిలించి, గిట్టలతో భూమిని మోద సాగినై. ఆ చప్పుడుకు ఉగ్రదత్తుడూ, భద్రారుద్రులూ ఉలిక్కిపడి లేచి కూర్చున్నారు.

ఇప్పుడు అరణ్యమంతా తెల్లని వెలుగుతో నిండిపోయివుంది. ఆకాశాన్నంటుతూన్న పెద్ద పెద్ద మానులూ, వాటి నుంచి వేలాడుతున్న పొడుగాటి ఊడలూ, వాటిని ఆధారం చేసుకుని ఒక చెట్టు మీది నుంచి మరొక చెట్టు మీదికి ఉరుకుతూన్న కోతులూ, రంగురంగుల పక్షులూ—అంతా ఎంతో మనోహరంగా వున్నది.

"ఈ ప్రాంతం మనం వుండే అరణ్యప్రాంతంకన్న ఎంతో అందంగా వున్నది," అన్నాడు ఉగ్రదత్తుడు.

"అందుకనే, ఈ సామంతరాజెవరో యిక్కడ కోట కట్టుకుని వుంటాడు. పులిరాయుళ్ళకు కూడా ఈ మారుమూలనున్న అరణ్యప్రాంతం మరెవరి కంటా పడకుండా దాక్కోవటం కష్టం కాదు," అన్నాడు రుద్రుడు.

పులిరాయుళ్ళ పేరు వింటూనే ఉగ్రదత్తుడు లేచి నిలబడ్డాడు. అతడితోపాటు స్నేహితులిద్దరూ కూడా లేచి నిలబడి, "కోటకేనా ప్రయాణం? గుర్రాన్ని తెమ్మంటావా?" అని అడిగారు.

"గుర్రా లెందుకు! కోట సుమారుగా ఎంత దూరంలో వుంటుంది?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"పావుకోసెడు దూరం కూడా వుండదని నా నమ్మకం. అయినా, నేను చీకట్లో

చెట్టు మీది నుంచి చూశాను. నేను ఊహించిన దానికన్న ఎక్కువ దూరం వుండినా వుండవచ్చు." అన్నాడు రుద్రుడు.

"ఎంత దూరం అయితే మనకేం? గుర్రా లెక్కండి." అన్నాడు అరుద్రుడు.

ముగ్గురూ గుర్రాలు కట్టివేసి వున్న చెట్టు దగ్గిరకు వెళ్ళి, వాటి తాళ్ళు విప్పుతూన్నంతలో, అల్లంత దూరాన్నుంచి పెద్దగా ఆర్తనాదం వినబడింది.

అది వింటూనే స్నేహితులు ముగ్గురూ నిశ్చేష్టులయ్యారు. ఆ ఆర్తనాదం చేసినది ఒక స్త్రీ కంఠం.

"ఎవరో స్త్రీ ప్రమాదంలో చిక్కుకున్నట్టున్నది!" అన్నాడు రుద్రుడు.

"ఊఁ, త్వరగా రండి, పరిగెత్తండి!" అంటూ ఉగ్రదత్తుడు కత్తి దూసి ఆర్తనాదం వచ్చిన దిక్కు కేసి వేగంగా పరిగెత్త సాగాడు.

స్నేహితులు ముగ్గురూ కొంత దూరం పరిగెత్తేసరికి, చెట్ల వెనకగా కొన్ని మానవాకారాలు కనిపించినై. మరి కొంత దూరం ముందుకు వెళ్ళేసరికి, పట్టువస్త్రాలు ధరించి, సర్వాభరణాలతో వున్న ఒక యౌవనవతిని, నలుగురు పులిరాయుళ్ళు పట్టుకునేందుకు చేసే ప్రయత్నం వాళ్ళ కంటబడింది. ఆమె, ఆమె వెంట వున్న దాసీలూ పులిరాయుళ్ళకు చిక్కకుండా పారిపోయేందుకు ప్రయత్నిస్తూ, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెడుతున్నారు.

"భయం లేదు, వస్తున్నాం!" అంటూ ఉగ్రదత్తుడూ, రుద్రారుద్రులూ కేక పెట్టారు. ఆ మరుక్షణం చెట్ల కొమ్మల మీది నుంచి బిలబిలమంటూ కొందరు పులిరాయుళ్ళు వాళ్ళ మధ్యకు దూకారు. ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులూ, ఈ అనుకోని దాడికి నిశ్చేష్టులై తెప్పరిల్లే లోపలే, పులిరాయుళ్ళు వాళ్ళను నిరాయుధుల్ని చేసి, తాళ్ళతో కాళ్ళూ చేతులూ బిగించి, భయంకర పక్షుల కేసి లాక్కుపోయారు. —(ఇంకావుంది)






# బ్రహ్మరాక్షసి ఆగ్రహం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, విషసర్పాలకూ, భూతప్రేతాలకూ నిలయమైన, ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ ప్రాణాలకు సైతం లెక్కచేయక నువ్వు పడే శ్రమ, పదుగురి కోసమా? లేక నీ స్వార్థం కోసమా? ఎందుకంటే, స్వార్థపూరితమైన ఏ ఆలోచనా మంచి ఫలితాన్ని ఇవ్వదు. ఇందుకు ఉదాహరణగా, ఒక కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొక గ్రామంలో, రాజయ్య అనే రైతుకు, సువర్చల అనే కూతురుండేది. ఆమెనిచ్చి పెళ్ళి చేసి, తన ఇంటనే వుంచుకోవాలని, చిన్నతనంలోనే తల్లి

## బేతాళ కథలు



దండ్రులను పోగొట్టుకున్న, తన మేనల్లుడు సాగరుణ్ణి చేరదీసి, పెంచి పెద్ద చేశాడు, రాజయ్య.

ముక్కుకు సూటిగా నడిచే సాగరుడికి, గ్రామాధికారి అంటే పడేదికాదు. ఆ గ్రామాధికారి, ఆ దేశపు సైన్యాధిపతి అండదండలతో, తన స్వార్థం కోసం ప్రజలను రకరకాలుగా హింసించేవాడు. సాగరుడు, ఆ దారుణాలను సహించలేక, గ్రామాధికారిపై రాజుగారికి ఫిర్యాదు చేశాడు.

ఆ కకతో సైన్యాధిపతి, రాజుగారి కోశాగారాన్ని కొల్లగొట్టేందుకు పథకాలు వేస్తున్నాడన్న అభియోగం మోపి, సాగరుణ్ణి బంధించి, రాజు ఎదట హాజరు పరిచాడు.

ముక్కోపి అయిన రాజు, నిజానిజాలు తెలుసుకోకుండానే, "ఈ రాజద్రోహిని చిరుతలు తిరిగే కారడివిలో, చెట్టుకు కట్టిరండి!" అని భటులను ఆజ్ఞాపించాడు.

భటులు ఆ విధంగానే, సాగరుణ్ణి ఒక ఊడలమర్రికి కట్టి వెళ్ళిపోయారు. ఏ చిరుతపులో తనను తినకమానదని, ప్రాణాల మీద ఆశ వదులుకున్న సాగరుడికి, "దాహం! దాహం!" అన్న కేక వినిపించింది.

అతడు ఆశ్చర్యపోయి చూస్తున్నంతలో, ఒక బ్రహ్మరాక్షసి, అతడి ముందు ప్రత్యక్షమై, "నరుడా, నా దాహం తీర్చు!" అన్నది వగర్చుతూ.

ప్రాణాల మీద ఆశ వదులుకున్న సాగరుడు, రాక్షసిని చూసి భయపడక, "అదుగో, ఆ పక్కన అంత పెద్ద వాగు పారుతూంటే, దాహం అని నన్నడుగుతావేం?" అని ప్రశ్నించాడు.

అందుకు బ్రహ్మరాక్షసి, "నరుడా, నేను శాపగ్రస్తురాలను. నా చేయి తగిలితే, నీరు యింకిపోతుంది. నీ కట్లు విప్పుతాను. నా దాహం తీర్చు!" అంటూ, అతడి కట్లు విప్పి, ఒక మట్టిపాత్రను సృష్టించి, సాగరుడి చేతి కిచ్చింది.



సాగరుడు, ఆ పాత్రతో వాగు నుంచి నీరు తెచ్చి, నాలుగైదుసార్లు బ్రహ్మరాకసి నోటిలో పోసి, దాని దాహం తీర్చాడు.

అప్పుడు బ్రహ్మరాకసి, సాగరుణ్ణి, "నరుడా, నీ కొచ్చిన కష్టం ఏమిటి?" అని అడిగింది.

సాగరుడు జరిగింది చెప్పి, "నా కోసం కాకపోయినా, నా గ్రామ ప్రజల సుఖం కోసం, ఆ దుష్టుల్ని దండించి తీరాలి. అందుకు సాయం చెయ్యి." అన్నాడు.

రాకసి పరమానందంతో, "భళిరా, నరుడా! తమ స్వార్థం కాక, పదిమంది మేలుకోరే, నీలాంటి వాళ్ళకు తప్పక సాయపడతాను," అని, గాలిలోంచి కొన్ని నగలు తీసి, సాగరుడి కిస్తూ,—"ఇవి, యువరాణి నగలు. యిక నీ తెలివి తేటలతో, పగసాధించు," అన్నది.

సాగరుడు, ఆ నగలతో గ్రామానికి తిరిగి వచ్చి, ఒక రాత్రివేళ, వాటిని గ్రామాధికారి పెరటి గోడ మీదుగా లోపలికి జారవిడిచాడు. మర్నాడు, వాటిని చూసిన గ్రామాధికారి భార్య, అవి అక్కడి కెలా వచ్చినవన్న సంగతి ఆలోచించకుండా, యువరాణి నగలను సింగారించుకుని, గ్రామంలో అందరికీ చూపించసాగింది.

ఆ నగలకోసం, ఊరూ, వాడా గాలిస్తున్న రాజుగారి వేగులు, గ్రామాధికారి భార్య ధరించిన నగలు ఎవరివో గుర్తుపట్టి, ఆ సంగతి రాజుగారికి చెప్పారు. రాజు వెంటనే భటులను పంపగా, వాళ్ళు గ్రామాధికారినిబంధించితీసుకుపోయారు. అతణ్ణి విడుదల చేయించడం కోసం, సైన్యాధికారి నానా యాతనాపడ్డాడు.

ఈ విధంగా పదవి పోగొట్టుకున్న గ్రామాధికారి, దీనికంతకూ సాగరుడు కారణం అని గ్రహించి, అతడి మీద పగసాధించేందుకు, సైన్యాధిపతితో కలిసి కుట్ర చేయసాగాడు.

ఆ సమయంలోనే, రాజ్యంలో దొంగ తనాలూ, దోపిడీలు ఎక్కువయ్యాయి. దొంగలను పట్టేందుకు రాజు చేసిన



వాగు దగ్గిర కూర్చుని దాహంతో అలమటించి పోతున్నది.

అది సాగరుణ్ణి చూస్తూనే, "ముందు, నా దాహం తీర్చు, నరుడా! ఏవైనా సంగతులుంటే, తర్వాత మాట్లాడుకుందాం," అన్నది.

సాగరుడు, బ్రహ్మరాకసి దాహం తీర్చి, జరిగింది చెప్పి, "నా ప్రాణం గురించిన బెంగ నాకేం లేదు. రాజ్యంలో ప్రజలు దొంగలవల్ల, నానా యిక్కట్లపాలవుతున్నారు. దొంగలను పట్టి, ప్రజలకు రక్షణ కల్పించాలి," అన్నాడు.

"స్వార్థం లేని, నీ బుద్ధి మెచ్చదగిందిరా, నరుడా!" అంటూ రాకసి, దాపులనున్న పొదలలో నుంచి రెండు పులులను లాగి, వాటిని సాగరుడి ముందు వదుల్తూ, "వీటిని వెంటపెట్టుకుపో. దొంగలు దొరికిపోతారు," అన్నది.

పులులను చూసి సాగరుడు భయపడుతున్నంతలో, అవి రెండూ నూతన వధూవరుల రూపాలు ధరించాయి. వధువు వంటి నిండా, మోయలేనన్ని బంగారు నగలున్నవి. వరుడు పసుపు బట్టలతో వున్నాడు.

సాగరుడు, వాళ్ళను వెంటబెట్టుకుని, చీకటిపడేవేళకు రాజధానికి దాపులనున్న, ఒక సత్రంలో విడిది చేశాడు.

ప్రయత్నాలు ఫలించలేదు. సాగరుణ్ణి హతమార్చదలచిన సైన్యాధిపతి, రాజుతో ఫలాని గ్రామంలో వున్న సాగరుడనే అతను, దొంగలను పట్టడంలో సమర్థుడనీ, అతణ్ణి పిలిపించమనీ సలహా యిచ్చాడు.

రాజు, సాగరుణ్ణి పిలిపించి, "నువ్వు దొంగల్ని ఎలా పడతావో నాకు తెలియదు. మూడు రోజులలోగా వాళ్ళను పట్టి, నా వద్దకుతేవాలి. అలా చేయకపోయావో, నిన్ను కొరతవేయిస్తాను," అని ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞ వెనక గ్రామాధికారీ, సైన్యాధిపతుల కుట్ర వున్నదని గ్రహించిన సాగరుడు, వెంటనే అడవిలో వున్న ఊడల మర్రి దగ్గిరకు వెళ్ళాడు. బ్రహ్మరాకసి,

రాత్రి రెండో జామున, నలుగురు దొంగలు సత్రంలో ప్రవేశించి; వధువు వంటిపై నున్న నగలు తీయబోయారు. మరుక్షణం, వధూవరుల రూపంలో వున్న పులులు, నిజరూపాలు ధరించి, పెద్దగా గాండ్రిస్తూ, పంజాలతో దొంగలను గాయపరిచి, చీకట్లోకి పారిపోయినై.

ఈ గొడవకు మేల్కొన్న సత్రం యజమానీ, యితర ప్రయాణీకులూ, దొంగలతో పాటు, సాగరుణ్ణి కూడా పట్టుకు తీసుకుపోయి, రాజుకు అప్పగించారు.

రాజు, దొంగలను చిత్రహింసలపాలు చేయిస్తాననేసరికి, వాళ్ళు తామీ దొంగతనాలన్నీ, గ్రామాధికారీ, సైన్యాధిపతుల అండదండలతో చేస్తున్నట్టు చెప్పేశారు.

రాజు ఉగ్రుడైపోయి, గ్రామాధికారినీ, సైన్యాధిపతినీ కారాగారంలో వేయించి, సాగరుణ్ణి సైన్యాధిపతిగా నియమించాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు వర్షాకాలం ప్రారంభమైంది. ఏనాడూ లేనంతగా, వర్షాలు ఎడతెరిపిలేకుండా కురవడంవల్ల, రాజ్యమంతా నీటిమయమైపోయింది. వాగులూ, చెరువులూ నిండిపోయి, గ్రామాలకు గ్రామాలే మునిగిపోసాగాయి.

ఈ దశలో, సాగరుడు బ్రహ్మరాక్షసి దగ్గిరకు పోయి, రాజ్యాన్ని నీటిముంపు నుంచి కాపాడవలసిందిగా కోరాడు.



బ్రహ్మరాక్షసి, సాగరుడి వెంట బయలుదేరి, ఉధృతంగా ప్రవహిస్తున్న వాగులనూ, వంకలనూ తాకేసరికి, అవి ఎక్కడికక్కడ ఎండిపోయాయి. బ్రహ్మరాక్షసి వానలు కురిసినంతకాలం అక్కడే వుండి, తన నివాసానికి వెళ్ళిపోయింది.

ఈ విధంగా, రాజ్యాన్ని ఘోరప్రమాదం నుంచి కాపాడినందుకు, రాజు ఎంతగానో సంతోషించి, యువరాణితో సాగరుడి వివాహం వైభవంగా జరిపించాడు.

కొద్ది రోజుల తర్వాత, సాగరుడు బ్రహ్మరాక్షసినిచూసేందుకు, ఊడలమర్రి దగ్గిరకు వెళ్ళాడు. బ్రహ్మరాక్షసి, అతణ్ణి చూస్తూనే ఆగ్రహంతో, "ఓరీ, నరుడా!

దాహంతో, నా ప్రాణాలు పోయినా లెక్క చెయ్యను. నువ్వు మాత్రం, సహాయం కావాలంటూ, నా దగ్గిరకు రాకు. ఈ జన్మలో యిక మానవుడి కంటబడను!'' అని అదృశ్యమైపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, దాహం తీర్చితేచాలు, ఎలాంటి సాయమైనా చేస్తానన్న బ్రహ్మరాక్షసి, సాగరుడు వివాహం చేసుకున్న వెంటనే, ఎందుకు సహాయపడ నిరాకరించింది? సాగరుడు, తన కారణంగా, ఒక రాజుకు అల్లుడయ్యాడని ఈర్ష్యపడిందనుకోవడానికి అవకాశం లేదు. ఎందువల్లనంటే, మనిషికీ, రాక్షసికీ మధ్య ఈర్ష్యాద్వేషాలకు తావు లేదుకదా. అలాంటప్పుడు, ఇక మానవుడి కంటబడనంటూ బ్రహ్మరాక్షసి ఎందుకు అదృశ్యమైపోయింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో,నీతలపగిలిపోతుంది,"అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''స్వలాభం చూసుకోకుండా, పదిమందికీ మేలు చేసే వాళ్ళకు, బ్రహ్మరాక్షసి సాయపడుతుందనేది స్పష్టం. సాగరుడు మొదటిసారి రాక్షసిని చూడబోయినప్పుడు, తనను గురించి చెప్పుకున్నాడు. అనాథగా వున్న సాగరుణ్ణి చేరదీసి పెంచి పెద్ద చేశాడు, అతడి మేనమామ. ఆయన సాగరుడికి, తన కుమార్తె నిచ్చి వివాహం చేయాలన్న కొండంత ఆశతో వున్నాడు. కాని, సాగరుడు తన గతాన్నంతా మరిచి, స్వార్థం కొద్దీ యువరాణిని వివాహం ఆడాడు. ఇది చూసిన బ్రహ్మరాక్షసి, అతడిలో స్వార్థ చింతన ప్రారంభమయిందని గ్రహించి, ఇక మానవుడి కంటబడనంటూ అదృశ్యమైంది. బ్రహ్మరాక్షసి అన్న మాటలను బట్టి—లోగడ సాగరుడి వంటి వాళ్ళు కొందరు, దాని సహాయాన్ని సొంత లాభానికి ఉపయోగించుకున్నట్టు గ్రహించవచ్చు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# ఆశ్రితపక్షపాతం

కాంచనదేశపు మహారాజు కుమారవర్మ, ఎంతో కుశాగ్రబుద్ధి కలవాడు. అయన సింహాసనానికి వచ్చిన రోజునుంచే, రాజోద్యోగులు పనిచేసే తీరును, ఒక కంట కనిపెట్టసాగాడు.

ఆయన ఒకనాడు, ఉద్యానవనంలో తిరుగుతూండగా, అక్కడ పూలమొక్కలకు బోదెలు చేసి, నీరు పోసేవాడొకడు కనిపించాడు. వాడి పని తీరు గమనించిన రాజుకు, వాడు తోటపని చేయడం నేర్చిన వాడుకాదనితెలిసిపోయింది. కుమారవర్మ, వాణ్ణి సమీపించి, "లోగడ, నిన్నిక్కడ చూసినట్టులేదు. ఇక్కడ పని చేసే తోటమాలి ఏమయ్యాడు?" అని ప్రశ్నించాడు.

దానికి వాడు, "ప్రభూ, ఆ తోటమాలి పాము కాటుకు గురయ్యాడు. ఆ తర్వాత, ఉద్యానపాలకుడు, నన్నీపనిలో ప్రవేశ పెట్టాడు," అని జవాబిచ్చాడు.

"నువ్వీపనిలో కుదరకముందు, ఏం చేస్తూండేవాడివి?" అని అడిగాడు రాజు.

"ఉద్యానపాలకుడి యింట, చిల్లర మల్లర పనులు చేస్తూండేవాడిని, ప్రభూ," అన్నాడు వాడు.

కుమారవర్మ, వాణ్ణి మరేమీ ప్రశ్నించకుండా, భవనానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఆయన, నగరపాలకుణ్ణీ, గజశాలాధిపతినీ, రాజప్రాసాద కాపలాదార్ల నాయకుణ్ణీ పిలిపించి, "నాకు కొత్తగా, మరొక అంగరక్షకుణ్ణి నియమించుకోవాలన్న అభిప్రాయం కలిగింది. అందుకు, దేహబలంతోపాటు, తెలివితేటలూ, చురుకుదనం, సాహసం కలవాడు కావాలి. మీ ఎరుకలో, అలాంటివాళ్ళెవరైనా వుంటే చూడండి," అని చెప్పాడు.

వారం గడవకముందే, ముగ్గురు రాజోద్యోగులూ, కుమారవర్మను విడివిడిగా

జొన్నలగడ్డ రత్న

కలుసుకుని, తమ అంచనా ప్రకారం, అంగరక్షకుడి ఉద్యోగానికి అర్హులైన వాళ్ళంటూ, కొందరిని ఆయనకు పరిచయం చేశారు. రాజు, వాళ్ళను కొన్ని ప్రశ్నలడిగి, పంపించివేశాడు.

ఆ తర్వాత కుమారవర్మ, ఒకనాడు మంత్రులనూ, ముఖ్య రాజోద్యోగులనూ సమావేశపరిచి, ''నాకు కొత్తగా ఒక అంగరక్షకుడు కావాలని చెప్పగానే, ముఖ్యోద్యోగుల్లో కొందరు, అందుకు అర్హులంటూ కొందర్ని, నావద్దకు తెచ్చారు. అసలు సంగతేమంటే, నాకు అంగరక్షకుడి అవసరం లేదు. ఉన్నతాధికారుల ప్రవర్తన ఎలా వున్నదో తెలుసుకునేందుకే అలా చేశాను,'' అని చెప్పాడు.

కుమారవర్మ మాటలకు, అందరూ విస్తుపోయారు. అప్పుడు మంత్రి మంగళసేనుడు, రాజుతో, "ప్రభువులు, ఉన్నతాధికారులకు ఏదో పరీక్ష పెట్టినట్టున్నది. అందుకు కారణం ఏమిటో అర్థం కావడం లేదు,'' అన్నాడు.

కుమారవర్మ కొత్తగా తోటమాలిపని చేస్తున్నవాడిని గురించి చెప్పి, "తోటపనిలో అనుభవం లేనివాడు, ఉద్యానపాలుడి చలవవల్ల, తోటమాలి అయాడు. అలాంటి వాడి చేతుల్లో, ఉద్యానం మరి కొన్నాళ్లకు, ఎలాంటి దుర్దశకు గురి అవుతుందో, మనం ఊహించ వచ్చు,'' అన్నాడు.

అది విన్న ఉద్యానపాలుడు తల వంచుకున్నాడు. కుమారవర్మ, "ఉద్యానపాలుడివంటి చిన్న రాజోద్యోగి, తన ఆశ్రితులకు కొలువులో ఉద్యోగాలు యిప్పించగలిగినప్పుడు, పెద్ద, పెద్దపదవులు నిర్వహిస్తున్న వాళ్ళ మాటేమిటి ? అందువల్ల, యీనాటి నుంచీ, ఎంత చిన్న ఉద్యోగానికి ఖాళీ ఏర్పడినా, ఆ విషయం దండోరా వేయించడం ద్వారా, అందరికీ తెలియపరచవలసి వుంటుంది,'' అన్నాడు.

కుమారవర్మ, తాను సమావేశంలో చెప్పినదాన్ని, శాసనంగా ప్రకటించి, కొద్ది కాలంలోనే, ఉద్యోగులలో ఆశ్రిత పక్షపాతం లేకుండా చేశాడు.



మనదేశపు అద్భుతాలు :

# గోల్‌గుంబజ్




దక్షిణభారత దేశంలోని అద్భుతమైన కట్టడాలలో—ముహమ్మద్ అదిల్‌షా గోరీ అయిన గోల్‌గుంబజ్ చాల ప్రసిద్ధమైనది. ఈ గోరీ ముహమ్మద్ అదిల్‌షా చేతే నిర్మించబడింది! పెద్ద అర్ధగోళాకార గుమ్మటంతో, నాలుగుమూలలా—అర్ధగోళాకార బురుజులుగల అష్టభుజ స్తంభాలతో ఈ గోరీ చూపరులను ఆకర్షిస్తున్నది.




టర్కీ సుల్తాను మురాద్ చిన్న కొడుకయిన యూసుఫ్ అదిల్‌షా చేత బిజాపూర్ అదిల్‌షా వంశం స్థాపించబడినది. మురాద్ మరణానంతరం, అనవాయితీ ప్రకారం—ఆయన జ్యేష్ఠ కుమారుణ్ణి తప్ప తక్కిన కొడుకులందరిని రహస్యంగా హతమార్చవలసి వచ్చింది!

సింహాసనానికి పోటీలేకుండా చేయడం కోసం ఇలా చేయనున్నట్టు మంత్రులు—యూసుఫ్ తల్లికి తెలియజేశారు. తన కొడుకును పోగొట్టుకోవడానికి ఆమెకు మనసు ఒప్పలేదు. కొడుకును రక్షించుకోడానికి కొందరు విశ్వాస పాత్రులైన సేవకుల సహాయంతో, ఆమె ఒక పథకం వేసింది.





ఆమె విశ్వాస పాత్రులలో ఒకడు, అప్పుడే భారతదేశానికి బయలుదేరుతున్న ఒక వర్తకుల బృందాన్ని కలుసుకున్నాడు. వాళ్ళలో యూసుఫ్ పోలికలున్న ఒక బానిస కుర్రవాణ్ణి కొని, వాడికి యువ రాజు దుస్తులు తొడిగి, రహస్యంగా రాజభవనానికి చేర్చారు. ఆనాటి రాత్రే, బానిస వాణ్ణి యూసుఫ్ అనుకుని, హంతకులు హతమార్చారు!

యూసుఫ్ మరణించాడన్న వార్త వెలువడిన సమయానికి, అసలు యూసుఫ్ వర్తకులతో కలిసి భారతదేశం చేరుకున్నాడు. ఆ తరవాత వర్తకుల నాయకుడే యూసుఫ్ చదువు సంధ్యల బాధ్యతలు చేపట్టాడు.






కొన్నాళ్ళకు అందమైన యువకుడుగా తయారయిన యూసుఫ్ — బిదార్ సుల్తాను కొలువులో చేరాడు. క్రమక్రమంగా ఉన్నత పదవులకు ఎగబ్రాకి ఆఖరికి బిజాపూర్ గవర్నర్ అయ్యాడు. 1489 వ సంవత్సరంలో ఆదిల్‌షా అన్న బిరుదనామంతో, బిజాపూర్‌ను స్వతంత్ర మండలంగా ప్రకటించుకున్నాడు.

ఆదిల్‌షా సుల్తానులు అద్భుతమైన భవనాలెన్నిటినో నిర్మించారు. వారు నిర్మించిన కట్టడాలలో గోల్‌గుంబజ్ జగత్ప్రసిద్ధ మైనది. పరిమాణంలో ఈ గోరీ గుమ్మటం ప్రపంచంలో రెండవ స్థానాన్ని పొందుతున్నది. దీని వసారాలో ఒక మనిషి నడిస్తే చాలు సైన్యమే నడుస్తున్న శబ్దం వస్తుంది!





బిజాపూర్‌లో ఉన్న మరొక ముఖ్యమైన భవనం—నగర ప్రధాన మసీదు అయినటువంటి జామీమసీదు. అలీ అదిల్‌షా కాలంలో దీని నిర్మాణం ప్రారంభమయింది. ఒకేసారి 2,250 మంది భక్తులు సమావేశమై ప్రార్థనలు జరపడానికి అనువుగా ఈ మసీదు నిర్మించబడి ఉన్నది.

నగరానికి పశ్చిమదిశగా, 'మాలిక్-ఇ-మైదాన్' అని పేరు గాంచిన బ్రహ్మాండమైన ఫిరంగి ఉన్నది. బిజాపూర్‌లోనూ, ఇతర ప్రదేశాలలోనూ జరిగిన ఎన్నో యుద్ధాలలో ఈ ఫిరంగి ఉపయోగించబడింది.






అఫ్‌జల్‌ఖాన్ కోసమని కట్టబడిన గోరీలో మాత్రం అతడి భౌతికకాయాన్ని పాతిపెట్టలేదు. బిజాపూర్ సుల్తాను తరఫున, శివాజీని మోసంతో హతమార్చడానికి, అఫ్‌జల్‌ఖాన్ వెళ్ళాడు. ఆ దుర్మార్గుడి మోసాన్ని పసికట్టిన శివాజీ, వాణ్ణి తన 'పులిగోళ్ళ'తో చీల్చి చంపి అక్కడే పాతిపెట్టాడు!



# జ్ఞాపకార్థం

సిరిపురం అనే గ్రామం, ఒక కొండ పక్కన, చుట్టూ పండ్లతోటలతో, ఎంతో అహ్లాదకరంగా వుండేది. ఆ వాతావరణం ఎంతో ఆరోగ్యకరమైనదని ఎరిగిన ఎందరో ధనికులు, తమకు అస్వస్థతగా వున్నప్పుడు, అక్కడికి వచ్చి, కొన్నాళ్ళుండి పోతూండే వాళ్ళు.

ఆ గ్రామంలో నీలయ్య అనే నడికారు వాడొకడుండేవాడు. వాడికి నా అన్న వాళ్ళెవరూ లేరు. గ్రామానికి, ఆరోగ్యం కోసం వచ్చిన వారికి సాయపడుతూండే వాడు. వాళ్ళు తిరిగివెళ్ళేటప్పుడు, ఎంతో వినయంగా, ''అయ్యా, తమ జ్ఞాపకార్థం, ఈ నిరుపేదకు ఏదైనా యిచ్చి వెళ్ళండి!" అని కోరేవాడు.

వాళ్ళు, నీలయ్యకు ఎంతో కొంత డబ్బో, విలువైన వస్తువో యిచ్చి పోతూండే వాళ్ళు.

ఒకసారి, ఆ గ్రామానికి ఎక్కడి నుంచో కేశవచక్రవర్తి, అనే సంపన్నుడు వచ్చాడు. ఆయనకు నీలయ్య యథాప్రకారం అవసరంపడినప్పుడు చిన్నా, పెద్ద పనులు చేసి పెడుతూండేవాడు. కేశవచక్రవర్తి, వాడికి ఎప్పటికప్పుడు నాలుగు డబ్బు లిస్తూండేవాడు.

ఇలా కొన్ని రోజులు గడిచాక, ఒకనాడు కేశవచక్రవర్తి, నీలయ్యతో, ''మీ గ్రామ వాతావరణం, నాకు పూర్తి ఆరోగ్యాన్ని కలిగించింది. త్వరలో మా ఊరు వెళ తాను,'' అని చెప్పాడు.

నీలయ్య అలవాటుప్రకారం, "అయ్యా, యిక్కడికి ఎంతోమంది సంపన్నులు వచ్చి వెళుతూంటారు. వారు వెళ్ళేనాడు, తమ జ్ఞాపకార్థం ఏదో ఒకటి యిచ్చి పోతూంటారు. ఈ వేలి ఉంగరం, చేతికి వున్న వెండి మురుగు, ఇంట్లో వున్న పెద్ద

అరుపల్లి గోవిందరాజులు



కొయ్యపెట్టె—అలాంటివారు యిచ్చినవే!" అన్నాడు.

అందుకు కేశవచక్రవర్తి, "అలాగా! నేను, వాళ్ళందరూ యిచ్చిన వాటికన్న విలువైనది, యిచ్చి తీరుతాను!" అన్నాడు.

నీలయ్యకు ఎక్కడలేని సంతోషం కలిగింది. వాడు, కేశవచక్రవర్తి గ్రామం వదిలి వెళ్ళే రోజు కోసం ఎదురు చూడసాగాడు.

ఒకనాడు నీలయ్యకు, పొరుగు గ్రామంలో పని పడింది. వాడక్కడికి పోయి, పని చూసుకుని నాలుగు రోజుల తర్వాత తిరిగి వచ్చాడు. కేశవచక్రవర్తి రెండు రోజుల క్రితమే, గ్రామం వదిలి వెళ్ళినట్టు తెలిసి, వాడికి ఆశ్చర్యంతో పాటు బాధ కలిగింది.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. నీలయ్య బాగా వృద్ధుడైపోయాడు. వాడు ఒకనాడు, ఎవరిదో ఇంటి ముందున్న అరుగు మీద కూర్చుని వుండగా, గుర్రపు బండీలో ఒక సంపన్నుడు అక్కడికి వచ్చి దిగి, నీలయ్య కేసి పరీక్షగా చూస్తూ, "ఈ గ్రామంలో కొంత కాలం విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నాను. ఈ ఇల్లేమైనా అద్దె కిచ్చేదా?" అని అడిగాడు.

నీలయ్య అరుగు దిగి, "అయ్యా, ఆ సంగతి, లోపలికి వెళ్ళి అడగండి," అన్నాడు.

"అలాగే! మరి, ఇప్పుడు నువ్వేమీ పనిపాట్లు చెయ్యడం లేదా?" అని అడిగాడు సంపన్నుడు.

ఆ ప్రశ్నకు నీలయ్య దిగులుగా ముఖం పెట్టి, "లేదు, బాబూ! ఓపిక బాగా తగ్గిపోయింది. పనుల్లో పొరబాట్లూ, జాప్యం జరుగుతున్నదని, ఎవరూ నాకు పనులు చెప్పడం లేదు. నేను వయసులో వున్నప్పుడు, ఈ గ్రామానికి వచ్చే పోయేవారిలో ఎందరు ధర్మప్రభువులూ, దానగుణం కలవారుండేవారు! ఇప్పు డలాంటివారు కనబడరు. ప్రతివారూ వెళ్ళేటప్పుడు, తమ జ్ఞాపకార్థం డబ్బో, విలువైన వస్తువో యిచ్చి పోతూండేవారు," అన్నాడు.

''ఇవ్వడం యిష్టం లేకో, లేక మరిచి పోయో వెళ్ళినవారు లేరా ?'' అని ప్రశ్నిం చాడు సంపన్నుడు.

నీలయ్య, ఏదో జ్ఞాపకానికి తెచ్చు కుంటున్నవాడిలా, కొంచెంసేపు మౌనంగా వూరుకుని, ''తన జ్ఞాపకార్థం, ఏమీ యివ్వ కుండా వెళ్ళిపోయినవా రొకరున్నారు; ఆయన పేరు కేశవచక్రవర్తి అని జ్ఞాపకం,'' అన్నాడు.

''ఆయన అలా ఎందుకు చేసి వుంటాడు ?'' అని అడిగాడు సంపన్నుడు నెమ్మదిగా.

''అదే తెలియదు, బాబూ ! నా అరవై ఏళ్ళ అనుభవంలో, అంత ఉదారబుద్ధి గలాయన్ని చూసి ఎరగను. నా అలవాటు ప్రకారం, ఆయన వెళ్ళిపోతున్నట్టు తెలియగానే, తమ జ్ఞాపకార్థం ఏమైనా యివ్వండి అన్నాను. తర్వాత, నేను అవ సరం అయిన పని మీద పొరుగూరు వెళ్ల వలసి వచ్చింది. నేను తిరిగి వచ్చే లోపలే, ఆయన వెళ్ళిపోయారు. నేను అత్యాశా పరుణ్ణనుకున్నారో ఏమో !'' అన్నాడు నీలయ్య.

సంపన్నుడు ఆప్యాయంగా, నీలయ్య భుజం తట్టి, ''నీలయ్యా ! ఆ కేశవ చక్రవర్తిని నేనే. ఎందరో నీకు, తమ జ్ఞాపకార్థం ఏవేవో యిచ్చిపోయారు. వాళ్ళె వరూ నీకు గుర్తులేరు. ఏమీ యివ్వని, నేను మాత్రం గుర్తున్నాను, అవునా ?'' అన్నాడు.

నీలయ్య నిర్ఘాంతపోయి, కేశవచక్ర వర్తికి నమస్కరించాడు.

కేశవచక్రవర్తి, అతడితో, ''లోగడ నేనిక్కడ వున్నప్పుడు, నీవు చేసిన సేవ లకు పెద్ద బహుమానమే యివ్వదలిచాను. ఈ ముసలితనంలో, నీ మంచి చెడ్డలు చూసేవాళ్ళెవరూ లేరుకదా ? నా వెంట, మా ఇంటికి రా. బతికినన్నాళ్ళూ, నీకు ఏ చీకూచింతా లేకుండా చూస్తాను,'' అంటూ గుర్రపుబండి కేసి కదిలాడు.

నీలయ్య ఆశ్చర్యానందాలతో, కేశవ చక్రవర్తిని అనుసరించాడు.



# అవసరం

శెళ్ళంగేరి గ్రామంలో వుండే బంగారయ్య ఇంటికి, తిమ్మప్ప అనేవాడు అప్పుడప్పుడూ వచ్చి, అతడికి ఐదు అరటిపళ్ళిచ్చి, రూపాయి తీసుకుపోతూండేవాడు. తిమ్మప్ప అరటితోట, బంగారయ్య వున్న గ్రామానికి, రెండామడల దూరంలో వున్నది.

ఒకసారి ఏదో శుభకార్యానికి, అరటిపళ్ళ అవసరం కలిగి, బంగారయ్య తిమ్మప్ప అరటితోటకు వెళ్ళి, వందపళ్ళు తీసుకున్నాడు. వాటికి ఇరవైరూపాయలివ్వమన్నాడు, తిమ్మప్ప.

బంగారయ్య ఆశ్చర్యపోతూ, "అదేమిటి, తిమ్మప్పా! రెండామడలదూరం నడిచివచ్చి, ఐదుపళ్ళకు రూపాయి తీసుకునేవాడివి. ఇప్పుడు, నేనే నీ తోటకు వచ్చి కొంటున్నా, అదే ధర యివ్వమంటున్నావు," అన్నాడు.

అందుకు తిమ్మప్ప నవ్వుతూ, "నేనే మీ ఇంటికి వచ్చి, పళ్ళు అమ్మానంటే, అది నా అవసరం. ఇప్పుడు, మీరే స్వయంగా తోటకువచ్చి పళ్ళు కొంటున్నారంటే, ఇది మీ అవసరం, కనుక, పళ్ళ ధరలో మార్పు ఎలా వుంటుంది!" అన్నాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్






మర్నాడు తెల్లవారుతూనే లవణుడు ఆహారం సంపాదించటానికై మధుపురం దాటి బయటికి వెళ్ళాడు. ఆ సమయంలో శత్రుఘ్నుడు యమునా నదిని దాటి, మధుపుర ద్వారం వద్ద నిలబడ్డాడు.

మధ్యాన్నం రెండు జాములయేసరికి లవణుడు తాను చంపిన జంతువులన్నిటినీ మోస్తూ తన నగరానికి తిరిగి వచ్చి, ద్వారం వద్ద నున్న శత్రుఘ్నుణ్ణి చూసి, నవ్వుతూ, ''ఒరే మనిషీ, నాకు ఆహారం కావటానికావచ్చావు? ఇవాళ నాకు మంచి విందే!'' అన్నాడు.

రోషంతో శత్రుఘ్నుడి కళ్ళు ఎర్రబడ్డాయి. ''నీతో యుద్ధం చేసి, నిన్ను చంపటానికి వచ్చానురా, లవణుడా! నేను దశరథమహారాజు కొడుకును, రాముడి తమ్ముణ్ణి. నా పేరు శత్రుఘ్నుడు. ఇవాళ నా చేత నీకు చావు తప్పదు,'' అన్నాడతను.

లవణుడు వెటకారంగా నవ్వి, ''నాకు మామవరస అయిన రావణుణ్ణి మీ అన్న చంపినా మిమ్మల్ని నేను లక్ష్యపెట్టలేదు. నేను మహామహావాళ్ళనే చంపాను. నాకు మీ వంటివాళ్ళు గడ్డితో సమానం. నన్నెవరూ జయించలేరు. నాతో యుద్ధం చెయ్యవచ్చావుగా? ఉండు నీ తీట తీరుస్తాను. నన్ను వెళ్ళి ఆయుధం పట్టుకు రానీ,'' అన్నాడు.

''నా కంటపడిన నిన్ను అంత సులభంగా ప్రాణాలతో పోనిస్తాననుకున్నావా?



నిన్ను ఈ క్షణంలోనే చంపేస్తాను," అన్నాడు శత్రుఘ్నుడు.

లవణుడు పళ్ళు కొరికి, చేతులు పిసుక్కుని, చెట్లు పెరికి శత్రుఘ్నుడి పైన విసరసాగాడు. శత్రుఘ్నుడా చెట్ల నన్నిటినీ తన బాణాలతో నరికాడు. కాని ఒక చెట్టు తల మీద తగిలి, శత్రుఘ్నుడు మూర్ఛపోయాడు.

అది చూసి, శత్రుఘ్నుడు చచ్చా డనుకుని, మందమతి అయిన లవణుడు తన శూలాన్ని తెచ్చుకోవటానికి వెళ్ళ లేదు. అందుకు మారుగా వాడు, తాను చంపిన మృగాల మోపు నెత్తుకుని బయలుదేరే టంతలో శత్రుఘ్నుడు మూర్ఛ తెలిసి, ద్వారానికి అడ్డంగా నిల బడ్డాడు. మరుక్షణమే అతను, రాముడు తన కిచ్చిన బాణాన్ని ధనువుకు సంధించి, లవణుడి పైకి వదిలాడు. అది నిప్పులు కక్కుతూ వెళ్ళి, లవణుడి గుండెను చీల్చింది. లవణుడు చచ్చాడు. వెంటనే వాడి ఇంట ఉండే త్రిశూలం శివుడి వద్దకు వెళ్ళిపోయింది.

తరవాత శత్రుఘ్నుడు తన సేనను పిలిపించి, మధుపురాన్ని ఆక్రమించి, దానికి రాజై పాలించసాగాడు. పన్నెండేళ్లు గడిచాక అతనికి రాముణ్ణి చూడా లనిపించింది. అతను కొద్ది సేననూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని అయోధ్యకు బయలుదేరి, దారిలో వాల్మీకి ఆశ్రమంలో ఒక రాత్రి మజిలీ చేశాడు.

వాల్మీకి శత్రుఘ్నుడికి అర్ఘ్యపాద్యా లిచ్చి ఆతిథ్యం జరిపి, అతనికీ, అతని సేనకూ, పరివారానికీ భోజనాలు పెట్టిం చాడు. భోజనా లయాక వారంతా వాల్మీకి రచితమైన రామకథను రాగ తాళాలతో సహా విని ఎంతో అద్భుతం చెందారు. జరిగిపోయిన ఆ కథ మళ్ళీ కళ్ళ ఎదట జరుగుతున్నట్టే వాల్మీకి రామ గాథను రచించాడు.

ఆ రాత్రంతా రామకథను వినటంలోనే గడిచిపోయింది. మర్నాడు శత్రుఘ్నుడు

వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, అయోధ్యకు వెళ్ళి, రాముణ్ణి చూసి, "అన్నా, నీ ఆజ్ఞానుసారం లవణుణ్ణి చంపి అతని రాజ్యాన్ని ఏలుతున్నాను. కాని పన్నెండేళ్ళపాటు నిన్ను చూడక తహతహ పుట్టి బయలుదేరి వచ్చాను," అన్నాడు.

రాముడు శత్రుఘ్నుణ్ణి కౌగలించుకుని, "నాయనా, రాజుకు రాజ్యం చెయ్యక తప్పదు గద. మనకు కర్తవ్య నిర్వహణ ప్రధానం. నీ రాజ్యం నీవు చూసుకో. ఎప్పుడన్నా నన్ను చూడాలనిపిస్తే వస్తూ ఉండు," అని అతన్ని పంపేశాడు.

భరత లక్ష్మణులు సపరివారంగా బయలుదేరి, శత్రుఘ్నుణ్ణి చాలా దూరం వరకు వెళ్లి ప్రేమతో సాగనంపి, వెనక్కు తిరిగి వచ్చారు.

తరవాత కొన్ని రోజులకు ఒక పల్లెటూరి బ్రాహ్మణుడు తన అయిదేళ్ళ కొడుకు శవం తెచ్చి రాజద్వారం దగ్గిర నిలబడి ఏడవటం మొదలుపెట్టాడు. తనకున్న ఒకే కొడుకు అకాలమరణం పొంది నందుకు ఏడుస్తూ ఆ బ్రాహ్మణుడు, రాజు సరిగా పాలిస్తే ఇలాటి అకాలమరణా లుండవనీ, ఇన్నాళ్ళకు ఇక్ష్వాకుల పరిపా లనలో, రాముడి హయాంలో దేశం దిక్కు మాలిన దయిందనీ అన్నాడు.

రాముడీ సంగతి తెలుసుకుని చాలా చింతించి, తన మంత్రులనూ, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులనూ పిలిపించి,





వారితో బ్రాహ్మణబాలుడి అకాలమరణం గురించి చెప్పాడు. ఒక శూద్రుడు గొప్ప తపస్సు చేస్తున్నాడనీ, అది యుగ ధర్మానికి విరుద్ధమనీ, అందుకే ఈ బాలుడు చనిపోయాడనీ నారదుడు రాముడితో అన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "నీవు వెళ్ళి ఆ బ్రాహ్మణుణ్ణి ఓదార్చి, ఆ బాలుడి కళేబరాన్ని తైల భాండంలో భద్రంగా ఉంచు," అన్నాడు. తరవాత అతను ఆయుధాలు తీసుకుని పుష్పకం ఎక్కి, పడమరా, ఉత్తరమూ, తూర్పూ గాలించి, చివరకు దక్షిణ దిక్కున, ఒక సరస్సులో తలకిందుగా తపస్సు చేస్తున్న మనిషినొకణ్ణి చూశాడు. అతను విమానం దిగి ఆ వ్యక్తిని సమీపించి, "నేను రాముణ్ణి, దశరథ మహారాజు కొడుకును. తెలుసుకోవాలన్న కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. నీవే జాతివాడివి? ఏం కోరి ఈ కఠోర తపస్సు చేస్తున్నావు?" అని అడిగాడు.

తలకిందులుగా ఉండే ఆ తాపసి, "రాజా, నేను శూద్రుణ్ణి. నా పేరు శంబూకుడు. బొందితో స్వర్గానికి పోగోరి నేనీ తపస్సు చేస్తున్నాను," అన్నాడు. అతనింకా మాట్లాడుతూండగానే రాముడు తన కత్తి దూసి శంబూకుడి తల నరికేశాడు.

వెంటనే దేవతలు రాముడిపైన పుష్ప వర్షం కురిపించి, దుందుభులు మోగించి, "రామా, ఈ శూద్రుడు స్వర్గానికి రాకుండా చేశావు. మాకంతే చాలు. ఏం వరం కోరుతావో కోరు," అన్నారు.

"అకాలమరణం పాలయిన ఆ బ్రాహ్మణబాలుణ్ణి బతికించండి," అన్నాడు రాముడు.

"శంబూకుడి తల తెగిన క్షణంలోనే ఆ బాలుడు బతికాడు," అంటూ దేవతలు వెళ్ళిపోయారు.

రాముడక్కడినుంచి, ఆ సమీపంలోనే ఉన్న అగస్త్యాశ్రమానికి వెళ్ళి, ఆ ముని

ఇచ్చిన అతిథి సత్కారాలు స్వీకరించాడు. అగస్త్యుడు రాముడికొక ఆభరణాన్ని బహూకరించాడు. రాముడు దాన్ని స్వీకరించి, "స్వామీ, ఇది దివ్యాభరణంలా గున్నది. ఇది తమకు ఎవరిచ్చారు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా అగస్త్యుడు శ్వేతుడి కథ చెప్పాడు.

వెయ్యి యోజనాల విస్తృతి గల ఒక అరణ్యం ఉండేది. దాని మధ్య యోజనం చదరం గల అందమైన సరస్సుండేది. ఆ అరణ్యంలో ఒక్క పక్షిగాని, మృగం గాని ఉండేది కాదు.



సరస్సుకు సమీపంలో ఒక ఆశ్రమం ఉండేది. అగస్త్యుడా ఆశ్రమానికి వెళ్ళి, ఒక రాత్రి అందులో గడిపి, తెల్లవారు జామున సరస్సు వద్దకు వెళ్ళాడు. దాని ఒడ్డున ఆయన కొక పుష్టిగల శవం కనబడింది. అది ఏమాత్రమూ చెక్కు చెదరకుండా ఉన్నది. అది ఏ విధమైన శవం అయి ఉంటుందా అని అగస్త్యుడు ఆలోచిస్తూండగా, అక్కడ ఒక విమానం ఆకాశం నుంచి దిగింది. అదొక దివ్య విమానం. అందులో ఒక దివ్యపురుషుడూ, అతన్ని సేవిస్తూ అనేకమంది అప్సరసలూ ఉన్నారు. అప్సరసలలో కొందరు పాడుతున్నారు, కొందరు వాద్యాలు వాయిస్తున్నారు, మరి కొందరు నృత్యాలు చేస్తున్నారు.

కొంతసేపయాక ఆ దివ్యపురుషుడు విమానం నుంచి దిగి, సరస్సు తీరాన ఉన్న శవాన్ని తిని, సరస్సులో చెయ్యీ, నోరూ కడుక్కొని, తిరిగి విమానం ఎక్కి పోయాడు.

అదంతా చూస్తూ ఉండిన అగస్త్యుడు, "అయ్యా, నీ వెవరు? ఇలాటి పనికి మాలిన భోజనం చెయ్యటానికి కారణ మేమిటి? ఎంత హీనులు కూడా ఇలాటి పని చెయ్యరు గదా!" అన్నాడు.

ఆ దివ్య పురుషుడు అగస్త్యుడికి తన పూర్వకథ చెప్పాడు:



అతను విదర్భ రాజైన సుదేవుడి కొడుకు. అతని పేరు శ్వేతుడు. సుదేవుడి కిద్దరు భార్యలు. ఇద్దరికీ ఇద్దరు కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడీ శ్వేతుడు. చిన్నవాడి పేరు సురథుడు. శ్వేతుడు తన తండ్రి అనంతరం చాలా కాలం రాజ్యం ఏలి, చివరకు సురథుడికి పట్టం కట్టి, తాను తపస్సు చేసుకున్నాడు. దీర్ఘ తపస్సుచేసి అతను దేహం చాలించి, బ్రహ్మలోకానికి వెళ్ళాడు. కాని బ్రహ్మ లోకంలో కూడా అతన్ని ఆకలి దప్పులు విడవలేదు. అది చూసి కంగారుపడి అతను బ్రహ్మ వద్దకు వెళ్ళి, బ్రహ్మ లోకంలో కూడా తనను ఆకలిదప్పులు వేధించటానికి తాను ఏం తప్పు చేసి ఉండాలని అడిగాడు.

దానికి బ్రహ్మ, "జంతువులు లేని అడవిలో నీకు భోజన సంతుష్టి ఏ మాత్రమూ లభించలేదు. అదీకాక నీవు అస్తమానమూ తపస్సులో ఉండి అతిథులకు భోజనం పెట్టలేదు. అందుకే నిన్ను ఆకలిదప్పులు వదలకుండా ఉన్నాయి. అరణ్యంలో ఉన్న నీ శవాన్నే తిని నీ ఆకలిదప్పులను తీర్చుకుంటూ ఉండు. కొంతకాలానికి అక్కడికి అగస్త్యుడు వచ్చి, తన అపార మైన మహిమచేత నీ ఆకలిదప్పులను పూర్తిగా పోగొట్టుతాడు." అని చెప్పాడు.

తనను పలకరించినవాడు అగస్త్యుడేనని తెలియగానే ఆ దివ్యపురుషుడు, "స్వామీ, నన్ననుగ్రహించి, నా కీ కష్టం తొలగించండి. దానికి ప్రత్యుపకారంగా ఈ ఆభరణం స్వీకరించండి. ఇది ప్రతిరోజూ బంగారాన్నీ, ధనాన్నీ, బట్టలనూ, ఆహారాన్నీ, నగలనూ ఇస్తూ ఉంటుంది." అన్నాడు.

అగస్త్యుడా ఆభరణాన్ని స్వీకరించ గానే శవం కాస్తా శిథిలమైపోయింది. దివ్యపురుషుడు సంతోషించి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

రాముడీ కథ విని అగస్త్యుడితో, "స్వామీ, శ్వేతుడు తపస్సు చేసినవనంలో

మృగాలూ, పక్షులూ లేకపోవటానికేమిటి కారణం?'' అని అడిగాడు.

ఆ కథను అగస్త్యుడీ విధంగా చెప్పాడు: కృతయుగంలో మనుచక్రవర్తి తన కొడుకైన ఇక్ష్వాకుడికి పట్టం గట్టి, రాజనీతి చక్కగా బోధించి, తాను బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. ఇక్ష్వాకు నూరుగురు కొడుకులను కన్నాడు. వారిలో ఆఖరి వాడు దండుడు. అతను బుద్ధిహీనుడు. ఆ దండుడికి, ఇక్ష్వాకు వింధ్య శైవల ప్రాంతాల మధ్య రాజ్యం ఇచ్చాడు. దండుడు అక్కడ మధుమంతమనే చక్కని నగరం నిర్మించుకుని, శుక్రాచార్యులను గురువుగా పెట్టుకుని, రాజ్యం చేస్తూ వచ్చాడు.

శుక్రాచార్యులకు అరజ అనే అందమైన కూతురుండేది. ఒకనాడు దండుడు వనంలో తిరుగుతూ, ఒంటరిగా ఉన్న అరజను చూసి, ఆమెను కోరాడు. అరజ, తాను శుక్రాచార్యుల కూతురిననీ, దండుడు వెర్రిమొర్రి వేషాలు వేస్తే శుక్రాచార్యులు ఘోరమైన శాపం ఇస్తాడనీ హితవు చెప్పింది. అయినా, మందమతి అయిన దండుడు అరజ హితబోధ వినక, ఆమెను అవమానించాడు.

అతను మధుమంతానికి తిరిగి వెళ్ళాక, అతని దుష్ప్రవర్తన శుక్రుడికి కూతురి ద్వారా తెలిసింది. మధుమంతం చుట్టూ నూరు యోజనాల మేర ఏడు రోజులపాటు ధూళివర్షం కురిసి, సమస్తమూ నశించి పోవాలని శుక్రాచార్యుడు పట్టరాని క్రోధావేశంతో శపించాడు.

ఈ శాపం సంగతి వింటూనే అక్కడ నివసించే వారందరూ ఆ ప్రాంతాన్ని విడిచి వెళ్ళిపోయారు.

శుక్రుడు చెప్పినట్టే ఆ ప్రాంతమంతా వారం రోజులపాటు ధూళివర్షం కురిసి నాశనమైపోయింది.

ఈ కథలు వింటూ రాముడు అగస్త్యాశ్రమంలో కొంతసేపుండి, ఆ మహాముని వద్ద సెలవు పుచ్చుకుని అయోధ్యకు తిరిగి వచ్చేశాడు.





# యుక్తిబలం

పూర్వం కాశ్మీరదేశాన్ని అవంతివర్మ పరిపాలిస్తూ వుండినప్పుడు ఏటా కరువులు వచ్చేవి. జనం తిండికి లేక అల్లాడిపోతూ వుండేవారు.

కాశ్మీర్ ఎత్తయిన కొండల నడుమ వున్న దేశం. అక్కడి నదులు ఎత్తయిన కొండల మీద పుట్టి మహావేగంగా దిగువకు ప్రవహిస్తాయి. ఆ కారణం చేత నదులు పొంగటమనేది తరుచుగా జరుగుతూండేది.

నిజానికి అక్కడి భూమి చాలా సారవంతమైనది. మహాపద్మసరస్సు కింద అనేక వేల ఎకరాలు చక్కగా సాగు అయి బంగారు పంట పండేది.

అయితే అది ప్రజలు అనుభవించే లోపుగా ఆ ప్రాంతంలోని వితస్తా నది పొంగటమూ, నది వెల్లువ సరస్సులోకి ప్రవహించటమూ, సరస్సు పొర్లి పంటలు నాశనం కావటమూ తరచుగా జరుగుతూండేది.

అవంతివర్మ ఎంతో ధర్మపరుడు. తన వల్ల ఏదో ద్రోహం జరగటం చేతనే తన ప్రజలు ఈ విధంగా కాటకం పాలవుతున్నారనుకున్నాడు. దేవుళ్ళకు ఎన్ని పూజలు చేయించాడు, గ్రహాలకు శాంతులు చేయించాడు. యజ్ఞాలూ, క్రతువులూ చేయించాడు. ఎన్నిచేసినా వరదలు నిలిచిపోలేదు.

ఇలా కొంతకాలం జరగగా, రాజు చెవిని ఒక వార్త పడింది. సుయ్యా అనేవాడొకడు తాను వరదలు పోగొట్టగలనని అందరి ఎదటా ప్రగల్భాలు పలుకుతున్నాట్ట. వాణ్ణి జనం పిచ్చివాడి కింద జమకట్టి తెగవాగించి ఆనందిస్తున్నారు.

ఏటా వచ్చే కాటకాలను పోగొట్టటానికి ఏదైనా చేయటానికి సిద్ధంగా వున్నందువల్ల



అవంతివర్మ సుయ్యాను తనవద్దకు పిలిపించాడు. సుయ్యా వచ్చి నమస్కారం చేసి నిలబడ్డాడు.

''నీవు కాటకాలను పోగొడతానంటున్నావట, నిజమేనా?'' అని అడిగాడు రాజు.

''చిత్తం, మహాప్రభూ! వరదలు పోతే కాటకం దానంతట అదే పోతుంది.'' అన్నాడు సుయ్యా.

''వరదలు ఎలా పోతాయి? నువు పోగొడతావా?'' అన్నాడు రాజు.

''చిత్తం, పోగొట్టగలను!'' అన్నాడు సుయ్యా.

''మేము చెయ్యలేని పనిని నీవొక్కడవే ఎలా చెయ్యగలవు?'' అన్నాడు రాజు.

''డబ్బిప్పించండి. ప్రపంచంలో డబ్బు చెయ్యలేని పని ఏముంటుంది?'' అన్నాడు సుయ్యా.

''మా ఖజానాలో వున్న డబ్బంతా పట్టుకుపో. కాని వచ్చే యేడు వరదలు రాకుండా చెయ్యి'' అన్నాడు రాజు.

మంత్రి రాజును వారించబోయాడు. కాని రాజు వినిపించుకోలేదు.

సుయ్యా ఖజానా నుంచి తాను మోయ గలిగినన్ని బంగారు నాణాలు మూట కట్టుకుని బయలుదేరాడు. ప్రజలు అతడి వెనకనే కేకలు పెడుతూ, గేలి చేస్తూ బయలుదేరారు. రాజుకు టోపీ వేసి సుయ్యా డబ్బు కాజేశాడని కొందరన్నారు. సుయ్యాతో బాటు రాజుకు కూడా పిచ్చి పట్టిందని మరి కొందరన్నారు. సుయ్యా ఆ ధనం తీసుకుపోయి ఏం చేస్తాడో చూడాలని అందరికీ బుద్ధి పుట్టింది.

ఏటా వరదలు తెచ్చే వితస్తా నది కొంత దూరం వెళ్ళాక కొండల సందుగా కనుమలో కుండా ప్రవహిస్తుంది. అనేక వందల ఏళ్ళుగా బ్రహ్మాండమైన బండరాళ్ళు రెండు వైపులా గల కొండల మీది నుంచి దొర్లివచ్చి నదికి అడ్డంగా వంతెన లాగా పడి వున్నాయి. వరదలు వచ్చినప్పుడు తప్ప మిగతా సమయాల్లో ప్రజలు ఇక్కడే నదిని దాటుతూ వుంటారు కూడాను. ఈ

రాళ్ళ వంతెన మూలంగానే వరదలు రావటమూ, సరస్సు పొర్లటమూ, పంటలు నాశనం కావటమూ జరుగుతూండేది.

సుయ్యా డబ్బుమూట మోసుకుని ఈ ప్రాంతానికే చేరుకున్నాడు. వాడి వెనకనే అనేక వేలమంది మనుషులు కూడా వచ్చారు. సుయ్యా నది కడ్డంగా వున్న రాళ్ళ మీదికి పోయి, మూటలో నుంచి బంగారు నాణాలు తీసి రాళ్ళ మధ్య గుప్పేళ్ళతో పడేస్తూ అవతలి ఒడ్డుకు పోసాగాడు.

జనంలో హాహాకారాలు బయలు దేరాయి. సుయ్యా నిజంగా పిచ్చివాడేనని రుజువయింది. లేకపోతే బంగారం ఆ విధంగా నదిలో పారబోస్తాడా? వాణ్ణి ఆపటానికి కూడా ఎవరికీ శక్యం కాలేదు.

జనంలో కొందరికి అకస్మాత్తుగా చైతన్యం కలిగింది. కొందరు గబగబా నీటిలోకి దిగి బంగారం కోసం వెతక సాగారు. మరికొందరు ముఠాలుగా చేరి పెద్ద పెద్ద బండరాళ్ళను ఒడ్డుకు తోసి వాటి కింద వున్న బంగారు నాణాలు ఏరుకోసాగారు.

కొద్దికాలానికే ఈ వార్త చుట్టుపక్కల గ్రామాలకు పాకింది. లక్షలాది జనం వచ్చి, అనేక వందల ఏళ్ళుగా నదికి అడ్డంగా పడివున్న రాళ్ళను ఒడ్డుకు పట్టించసాగారు. వాళ్ళ ప్రయత్నాలను ప్రోత్సహించటానికి సుయ్యా ఖజానా నుంచి ఇంకా, ఇంకా బంగారు నాణాలు తెచ్చి కదిలించని రాళ్ళ సందుల్లో పడెయ్య సాగాడు.

సాయంకాలం లోపుగా రాళ్ళవంతెన దాదాపు నిర్మూలమైపోయింది. కష్టపడి పని చేసిన ప్రజలకందరికీ బంగారు నాణాలు దొరికాయి.

అది మొదలు కాశ్మీర ప్రజలు వరదలూ, కాటకాలూ లేకుండా సుఖంగా జీవించారు.

సుయ్యా యుక్తికీ, అతడు దేశానికి చేసిన మేలుకూ మెచ్చుకుని, అవంతివర్మ అతనికి చాలా ధనమిచ్చి సత్కరించాడు.



# దురదృష్టవంతుడు

ఉజ్జయిని నగర ఆస్థానకవి రఘునాధుడు అఖండ మేధావి. శతాధికంగా కావ్యరచన చేసిన ఉద్దండపండితుడు. గొప్పకవి. ఆయన కుమారుడు సోమనాధుడు కూడా కవీ, పండితుడూనూ. అతడు కూడా కొన్ని కావ్యాల్ని రచించాడు. కాని, అవి అంతగా ప్రశంసలు పొందలేదు.

ఒకనాడు సోమనాధుడు. ఉజ్జయిని రాజు దగ్గిరకు వెళ్ళి, "మహారాజా, తమ అనుజ్ఞ అయితే, పొరుగు దేశం వెళ్ళి బతకాలని వున్నది," అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి, "మీ నాన్నగారు, నిన్ను సరిగా చూడడం లేదా?" అని ప్రశ్నించాడు.

"ఆ మాట నిజం అంటే, నా కళ్ళు పోతాయి," అన్నాడు సోమనాధుడు.

"నా రాజ్యంలో, నీకు సౌకర్యంగా లేదా?" అని అడిగాడు రాజు.

"పొరుగు రాజ్యంలో, ఇంతకంటే నేను అనుభవించగల భోగం వుండదు," అన్నాడు సోమనాధుడు.

"మరి, ఎందుకు పొరుగు రాజ్యం వెళ్ళాలనుకుంటున్నావు?" అని అడిగాడు రాజు.

ఆ ప్రశ్నకు జవాబివ్వబోయి, సోమనాధుడు చప్పున తల వంచుకోవడం గమనించిన మంత్రి, రాజుతో, "మహారాజా, ఈ కుర్రవాడికి అనుమతి యివ్వండి," అని సలహాయిచ్చాడు.

సోమనాదుడు వెళ్ళిపోయాక రాజు, మంత్రిని, "ఎందుకలా సలహాయిచ్చారు?" అని అడిగాడు.

"నిజమైన దురదృష్టవంతుడు, అసాధారణమైన ప్రజ్ఞగల తండ్రి గలవాడు!" అన్నాడు మంత్రి.

పొరుగు రాజ్యంలో సోమనాధుడికి, మహాకవి అన్న ఖ్యాతి త్వరలోనే లభించింది.

—డా॥ కాటిచెర గురురామ్మప్రసాద్





# అపకారికి ఉపకారం

## 6

జయవిజయులకు పరదేశిని ఎలాగైనా హతమార్చాలన్న పట్టుదల కలిగింది. పరదేశికి భోజనం, రోజూ జయవిజయుల యింటి నుంచే వెళ్ళేది. పరదేశిని బాధించాలని, వాళ్ళు అందులో ఒక రోజున, బాగా కారం కలిపారు. ఇందువల్ల, పరదేశికి ఎలాంటి బాధాకలగలేదుగాని, వాళ్ళ భోజనం కారం మయమైపోయి, నోరంతా పొక్కింది.

ఇది జరిగినా, వాళ్ళు బుద్ధి మార్చుకోక, మరొక రోజున పరదేశి భోజనంలో విషం కలిపారు. అంతే! ఆ పూట భోజనం చేస్తూనే, జయవిజయు లిద్దరూ, వాంతులు చేసుకుని స్పృహ తప్పి పడిపోయారు.

పెద్దపెద్దా, చిన్నపెద్దా వాళ్ళను పరీక్షించి చూస్తే నాడి అందడం లేదు. ఇద్దరూ కంగారుపడి, పరదేశి వద్దకు పరిగెత్తారు.

పరదేశి జరిగింది విని, "వాళ్ళు, నా భోజనంలో విషం కలిపివుంటారు! ఆ విషం నాకు ప్రమాదం కలిగించకపోగా, ఎదురుతిరిగి కలిపినవాళ్ళకే ప్రమాదం కలిగిస్తుంది. ఈసారికి, వాళ్ళ నెలాగో రక్షిస్తాను. మరొకసారి యిలా జరిగితే, వాళ్ళను నేను కూడా రక్షించలేను," అంటూ పెద్దల ఇంటిపెరట్లోకి వెళ్ళి, అక్కడేవో మొక్కల ఆకులు దూసితెచ్చి, వాటి పసరును జయవిజయుల నోట్లో పోశాడు.

ఆ వెంటనే, వాళ్ళిద్దరూ లేచి కూర్చున్నారు. చిన్నపెద్దా, పెద్దపెద్దా వాళ్ళకు జరిగిందిచెప్పి, "దుడుకుతనం కొద్దీ, మీ

"వసుంధర"



వదిలి, నువ్వు కొందరు గ్రామస్థులను వెంటబెట్టుకుని అరణ్యానికి వెళ్ళు. అక్కడ మీకు తోచిన ఒక చెట్టును ఎన్నుకుని, కాసేపు దానిచుట్టూ తిరిగి, తర్వాత శ్రీమహావిష్ణువు నామాన్ని స్మరిస్తూ కళ్లు మూసుకోండి. కొన్ని క్షణాలు గడిచాక, మీ ముందు ఒక దేవత ప్రత్యక్షమవుతుంది. మీరా దేవతతో జయుడు పంపగా వచ్చామని చెప్పండి. ఆమె, మీతో బయలుదేరి గ్రామానికి వచ్చేస్తుంది. ఆ దేవత, మీ యిద్దరి బుద్ధులూ మార్చగలదు!'' అని చెప్పాడు.

మర్నాడు విజయుడు, కొందరు గ్రామస్థులతో కలిసి, సమీపంలో వున్న అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ ఒక చెట్టును ఎన్నుకుని, దానిచుట్టూ తిరిగి, శ్రీమహావిష్ణువును స్మరించుకుంటూ కళ్లు మూసుకున్నాడు.

కొద్దిసేపటికి పెద్దగా చప్పుడు వినిపించింది. గ్రామస్థులు, ''దేవత ప్రత్యక్షమైంది! దేవత ప్రత్యక్షమైంది!'' అంటూ కేకలు పెట్టారు.

విజయుడు కళ్ళు తెరిచి ఆశ్చర్యపోతూ, ''ఏం జరిగింది?'' అని వాళ్ళను అడిగాడు.

గ్రామస్థులు చెట్టుకు ఒకపక్కగా సొమ్మసిల్లి పడివున్న ప్రియంవదను

ప్రాణాల మీదికి తెచ్చుకున్నారు. ఈనాటి నుంచీ, ఆ పరదేశి జోలికి పోకండి,'' అని హెచ్చరించారు.

జయవిజయు లిద్దరూ, పరదేశి కాళ్ళ మీద పడి, ''నువ్వు నిజంగానే గొప్ప మాంత్రికుడివి! మేము, నీకు అపకారం చేయకూడదనే అనుకుంటున్నాం కానీ— మావి వక్రబుద్ధులు. మా బుద్ధులు మంచి మార్గాన నడిచే ఉపాయం, నువ్వే చెప్పాలి!'' అన్నారు.

పరదేశి కొంచెంసేపు ఆలోచించి, ''మీరు చెప్పింది నిజం! మీ బుద్ధులు సరిదిద్దడం, నా బాధ్యత,'' అని, విజయుడి భుజం పట్టుకుని, ''రేపు జయుణ్ణి ఇక్కడే

చూపుతూ, ''ఎక్కడి నుంచి వచ్చిందో తెలియదు, ఇదిగో, దేవత!'' అన్నారు.

విజయుడు, ప్రియంవదను సమీపించి పరీక్షగా చూసి, ఆమె స్పృహ తప్పి వున్నట్టు గ్రహించి, గ్రామస్థులకు నీళ్ళు తేవలసిందిగా చెప్పాడు. వాళ్ళు నీళ్ళు తేగానే, ఆమె ముఖం మీద చల్లాడు.

ప్రియంవద కళ్ళు తెరిచి, ''నేనెక్కడ వున్నాను?'' అన్నది.

అందుకు విజయుడు, ''మేము యిక్కడికి దగ్గిరలో వున్న గ్రామస్థులం. జయుడు పంపగా వచ్చాం. మాతో గ్రామానికి వస్తావా?'' అని అడిగాడు.

జయుడి పేరు వింటూనే ప్రియంవద, అతడు తమ అంతఃపురంలోని కాపలా భటుడనుకున్నది. ఆ కారణంవల్ల, ఆమె అంగీకార సూచకంగా తలవూపి, ''నాకు బాగా ఆకలిగా వున్నది,'' అన్నది.

''నీవు కోరినవన్నీ యిస్తాం. మాతో గ్రామానికి బయలుదేరు,'' అన్నాడు విజయుడు.

గ్రామస్థులు ప్రియంవదను దేవతగా భ్రమించి, ఆమె కోసం ఒక పల్లకి తెచ్చారు. ప్రియంవదను అందులో కూర్చోబెట్టి, అందరూ శతనందనగ్రామం చేరారు. తర్వాత ఆమెను, పరదేశి నివసించే యింట వదిలిపెట్టారు.



పరదేశి చెప్పిన విధంగానే దేవత ప్రత్యక్షమైనదని విని, గ్రామంలోని పిల్లా, పెద్దా అందరూ ప్రియంవదను చూడ వచ్చారు. ఆమె అందచందాలు చూసి అందరూ అబ్బురపడ్డారు.

పరదేశి, గ్రామస్థులంతా అక్కడినుంచి వెళ్ళిపోయేదాకా ఆగి, ''ఎవరు నువ్వు? అరణ్యంలో హఠాత్తుగా ఎలా ప్రత్యక్షమయావు?'' అని ప్రియంవదను అడిగాడు.

ప్రియంవద, పరదేశి ముఖంలోని దివ్య తేజస్సుకు ఆశ్చర్యపడి, ''అయ్యా, నీవెవరో చూడబోతే యువకుడిలా వున్నావు. కాని, ముఖంలో మహాజ్ఞానులకు మించిన



తేజస్సు ఉట్టిపడుతున్నది! మీ ముందు, నా చరిత్ర దాచలేను,'' అని, తన కథ అంతా పరదేశికి వివరించి చెప్పింది.

అది విని పరదేశి, ఆమెకు తన కథ చెప్పి, ''అంతా చిత్రంగా వున్నది. ఒక జయుడి కోసమని బయలుదేరి, మరొక జయుడున్న చోటుకు చేరావు. ఏ దైవం, నా చేత ఆ పేరు పలికించిందో తెలియదు గాని, నిజంగానే దేవతలా వచ్చావు. ఇప్పుడేమి చేయడం బావుంటుందో, నువ్వే చెప్పు,'' అన్నాడు.

ప్రియంవద, ఆ మాటలకు సిగ్గు పడుతూ, ''నిన్ను చూడగానే, నా మనసులో ఎన్నడూ ఎరుగని సంతోషం పుట్టింది. నాకు, నీ దగ్గిరే వుండిపోవాలని పిస్తున్నది. నా కిప్పుడు మరే యితర కోరికాలేదు,'' అన్నది.

ఈ జవాబు వింటూనే, పరదేశి కంగారు పడి, ''నువ్వు, జయవిజయుల బుద్ధులను సక్రమమార్గంలో పెట్టగలవనుకుంటున్నాను. ముందు, ఆ పని చూడడం, నా కర్తవ్యం.'' అన్నాడు.

''నువ్వు ఏం చెబితే అది చేస్తాను,'' అన్నది ప్రియంవద.

ఆ తర్వాత పరదేశి, ప్రియంవదకు తృప్తిగా భోజనం పెట్టించాడు. ఆ వెంటనే ఆమెకు నిద్ర ముంచుకువచ్చింది.

ఈ లోపల జయుడు, విజయుడు కూడా, ప్రియంవద అందచందాలకు బాగా ఆకర్షితులయ్యారు. ఆ కారణంవల్ల, ఆనాటి నుంచీ యిద్దరూ, ఆమె వద్దనే వుంటూ, యితర విషయాలేమీ పట్టించుకోవడం మానేశారు.

ఒక రోజున జయుడు, ప్రియంవదతో, ''ఎల్లకాలం, నువ్వు మాతోనే వుండిపోతే, ఎంతో బావుంటుంది,'' అన్నాడు.

''అదెలా సాధ్యం? మరి కొన్నాళ్ళకు, నా పెళ్ళి జరిగిపోతుందిగదా!'' అన్నది ప్రియంవద.

''పెళ్ళయిపోతే ఏం?'' అని ప్రశ్నించాడు, విజయుడు అమాయకంగా.

"పెళ్ళయాక, నేను నా భర్త దగ్గిర వుండిపోతాను. ఇక్కడ వుండడం కుదరదు," అన్నది ప్రియంవద.

జయుడు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, "పోనీ, నువ్వు నన్నే పెళ్ళి చేసుకోరాదా," అన్నాడు.

"అందుకు విజయుడు ఒప్పుకుంటాడా ?" అన్నది ప్రియంవద.

"ఒప్పుకోను. నేను, నిన్నే పెళ్ళాడతాను," అన్నాడు విజయుడు పట్టుదలగా.

జయుడు, విజయుడి కేసి కోపంగా చూశాడు. ఇద్దరూ వాదులాటకు దిగారు.

ప్రియంవద, వాళ్ళను వారిస్తూ, "మీ ఇద్దరిలో ఒకరినే, నేను పెళ్ళి చేసుకోగలను. అందుకొక ఉపాయం వున్నది. ఈ గ్రామంలో వున్న పరదేశి, చాలా ప్రమాదకారుడు. అతణ్ణి, మీ యిద్దరిలో ఎవరు ఓడిస్తే, అతణ్ణి నేను పెళ్ళాడతాను," అన్నది.

"ఆ పరదేశి, మాయలమారి, మహా మాంత్రికుడు. వాడిని ఓడించడం, మా యిద్దరివల్లా కాదు," అన్నారు, జయ విజయులు ఏక కంఠంతో.

"నిజంగా నన్ను పెళ్ళాడదలిస్తే, మీరెలాంటి కఠిన కార్యాన్నయినా సాధించగలరు. ఆ పరదేశిని ఓడిస్తే తప్ప, లేక పోతే నేను మీలో ఒకరిని పెళ్ళాడలేను," అన్నది ప్రియంవద.

జయుడు అనుమానంగా చూస్తూ, "నిన్ను పెళ్ళాడాలంటే, ఆ పరదేశిని ఓడించాలా? ఎందుకు?" అని అడిగాడు.

"ఎందుకేమిటి ? ఆ పరదేశి మనకు పక్కలోబల్లెం వంటివాడు. రేపు నేను మీలో ఒకర్ని వివాహమాడాక, అతడు నన్ను బలవంతంగా ఎత్తుకుపోతే, అప్పుడు మీరేం చేస్తారు ? అందువల్లనే, అతణ్ణి ముందుగా ఓడించమంటున్నాను," అన్నది ప్రియంవద.

"నువ్వు చెప్పింది నిజమే ! రేపే ఆ పరదేశితో యుద్ధం చేసి, చిత్తుగా ఓడించేస్తాను," అన్నారు జయవిజయు లిద్దరూ ఒకేసారి. —(ఇంకావుంది)





# వంశగౌరవం

బుందేల్‌ఖండ్‌లో ఒక ఠాకుర్ వంశస్థుడు ఉండేవాడు. ఆయనను అందరూ "దీవాన్ సాహెబ్" అని పిలిచేవారు. ఆయనకు తిండికి కూడా గడవకపోయినా రాజసం చాలా ఉండేది. అతడు ఎలాటి ఉద్యోగమూ, చేసేవాడు కాడు; తన వంశం గొప్పతనం గురించి డాబులు కొడుతూ, అందరి కాలమూ పాడుచేసేవాడు.

ఒకనాడు దీవాన్ సాహెబ్ వీధిలో నిలబడి ఒక షావుకారుతో మాట్లాడుతూ ఉండగా, దూరాన ఒక బండి కనిపించింది. ఆ బండిమీద ధాన్యం బస్తాలు ఎత్తుగా వేసి ఉన్నాయి.

ఆ బండిని చూసి దీవాన్ సాహెబ్, "ఆహా! ఎంత పెద్ద ఏనుగు! మా తాతగారి దగ్గిర ఇలాటి ఏనుగే ఉండేది," అన్నాడు.

"తమరు పరాకు చిత్తగిస్తున్నారు, దీవాన్ సాహెబ్. ఆ వచ్చేది ఏనుగు కాదు, ధాన్యపు బస్తాలబండి," అన్నాడు షావుకారు చిన్నగా నవ్వుతూ.

"మీకు చత్వారం వచ్చేసినట్టుంది, షావుకారుగారూ! ఏనుగు యిటుకేసి రావటం స్పష్టంగా కనిపిస్తూంటేనే?" అన్నాడు దీవాన్ సాహెబ్.

"అది ఏనుగు కానేకాదు, ధాన్యపు బస్తాల బండీయే!" అన్నాడు షావుకారు.

"అది ఏనుగైతే నేను మీ తల నరికేస్తాను. బండీ అయితే నా తల మీరు నరకండి! ఇదే మనిద్దరి మధ్యా పందెం!" అని మీసాలు మెలివేస్తూ ఠీవిగా నిలబడ్డాడు దీవాన్ సాహెబ్. కొద్ది సేపట్లోనే బండి వారికి సమీపంగా వచ్చింది.

"చూశారా, దీవాన్ సాహెబ్? మీరు ఓడిపోయారు!" అన్నాడు షావుకారు.

"అవును. మీరు నా తల నరికి వెయ్యండి!" అన్నాడు దీవాన్ సాహెబ్.

బుందేల్‌ఖండ్ జానపద కథ

"దేనికిలే పోనివ్వండి!" అన్నాడు షావుకారు.

"అలా వీల్లేదు. పందెం ప్రకారం మీరు నా తల నరకవలసిందే! మా ఠాకుర్ వంశస్థులు అడితప్పరు!" అని దీవాన్ సాహెబ్ మూర్ఖించాడు.

షావుకారుకు ప్రాణంమీదికి వచ్చింది.

"అలా అయితే, మనం ఈ విషయం న్యాయాధికారిని సంప్రదించి, సలహా పొందటం మంచిదనుకుంటాను." అన్నాడు షావుకారు. దీవాన్ సాహెబ్ సరేనన్నాడు.

ఇద్దరూ కలిసి న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళారు. న్యాయాధికారి విషయమంతా విని, షావుకారుకు సంప్రాప్తించిన దుస్థితి గ్రహించి, ఈ విధంగా తీర్పు చెప్పాడు:

"దీవాన్ సాహెబ్‌గారి తల షావుకారు సొత్తు అయిన మాట నిజమే. కాని అయన దాన్ని తన యిష్టం వచ్చినప్పుడు నరుక్కోవచ్చు. ఆయనను తొందరచేయటానికి ఎవరికీ అధికారం లేదు!"

ఈ తీర్పు విని షావుకారు సంతోషించాడు. కాని దీవాన్ సాహెబ్ ఒక పేచీ పెట్టాడు: "అలా అయితే ఈ క్షణం నుంచీ నా తలను రక్షించే భారమూ, పోషించే భారమూ షావుకారుదే. దాని విషయమై ఇక నా పూచీ లేదు!"



షావుకారు గత్యంతరం లేనివాడై, దీవాన్ సాహెబ్ తలను రక్షించి, పోషించే భారం తన మీద వేసుకున్నాడు.

అయితే ఈ భారం కొద్దిపాటిది కాదు. తన వంశమర్యాదకు తగిన విధంగా దీవాన్ సాహెబ్ షావుకారుచేత పోషణ పొందుతూ షావుకారు ఇల్లు గుల్ల చేయసాగాడు.

కొంతకాలం గడిచింది. షావుకారుకు పట్టిన ఈ పీడను ఏవిధంగా విరగడ చేయాలా అని షావుకారు మిత్రులు ఆలోచించారు. వారికి ఒక ఉపాయం తోచింది. దాన్ని వాళ్ళు షావుకారుకు చెప్పారు.

వాళ్ళు వేసిన పథకం ప్రకారం, మర్నాడు ఒక మనిషి షావుకారు ఉండే

వీధి వెంబడి, ''ముక్కులూ, చెవులూ కొంటాం!'' అని కేక వేస్తూ వచ్చాడు.

షావుకారు ఆ మనిషిని పిలిచి, ''ఏమిటి నువు కొనేది?'' అని అడిగాడు.

''బాబూ, మనుషుల ముక్కులూ, చెవులూ కొంటాను,'' అన్నాడు ఆ మనిషి.

''ఎంత ధర చేసి కొంటున్నావు?'' అని షావుకారు ఆ మనిషిని అడిగాడు.

''గొప్ప వంశం వాళ్ళవైతే ముక్కూ, రెండు చెవులూ కలిపి అయిదు వంద లిస్తాను,'' అన్నాడు ఆ మనిషి.

షావుకారు ఆ మనిషికి దీవాన్ సాహెబ్‌ను చూపించి, ''వీరిది గొప్ప ఠాకుర్ వంశం. ఈయన తల ప్రస్తుతం నాదే! అయిదువందలూ ఇచ్చి, ఈయన ముక్కూ, చెవులూ కోసుకుపో!'' అన్నాడు.

దీవాన్ సాహెబ్‌కు హడలు పుట్టింది.

''అయ్యో, షావుకారుగారూ! ఇది చాలా అన్యాయం!'' అన్నాడు ఆయన.

''ఎందుకని అన్యాయం? ఈ తల నాది. నా సొత్తు. దీనిని నేను ఎంతో డబ్బు తగలేసి పోషిస్తూ వస్తున్నాను,'' అన్నాడు షావుకారు.

''మనం న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి. ఆయన సలహా పొందితే భావ్యంగా ఉంటుంది,'' అన్నాడు దీవాన్ సాహెబ్.

ఇద్దరూ మరొకసారి న్యాయాధికారి వద్దకు వెళ్ళి విషయమంతా చెప్పారు. న్యాయాధికారి దీవాన్ సాహెబ్‌తో ఇలా అన్నాడు:

''షావుకారుకు మీ ముక్కూ, చెవులూ అమ్మే అధికారం తప్పకుండా ఉన్నది. లేదని మీరు వాదించే పక్షంలో, ఇంత కాలమూ ఆయన మీ తలను పోషించినది మీ తరఫుననే అన్నమాట. అలా అయిన పక్షంలో ఇన్నాళ్ళూ మీకోసం షావుకారు చేసిన ఖర్చు యావత్తూ మీరు షావుకారుకు ఇచ్చుకోవలసి ఉంటుంది!''

ఈ తీర్పు విని దీవాన్ సాహెబ్ మారు మాటాడకుండా తనకున్న కొద్దిపాటి ఆస్తిని షావుకారు పేర పెట్టి, ఆ గ్రామం విడిచి వెళ్ళిపోయాడు.



## విధ్వంసకర కీటకం



ఎడారి మిడతలు రోజుకు తమ శరీరం బరువుగల ఆహారాన్ని తింటాయి. పెద్ద మిడతల దండు రోజుకు 20,000 టన్నుల పంటను భక్షించగలవు. 1784 వ సంవత్సరంలో దక్షిణ ఆఫ్రికాలో 2,000 చదరపుమైళ్ళు విస్తరించుకున్న మిడతల దండే ఈనాటివరకు రికార్డు చేయబడిన పెద్ద మిడతలదండుగా పరిగణించబడుతున్నది.

## బ్రహ్మాండమైన సస్తన భూచరం

20,000,000 — 40,000,000 సంవత్సరాల మధ్య కాలంలో నివసించిన బలూచిథేరియం అనే జంతువే భూమిమీద నివసించిన పెద్ద సస్తన జంతువుగా భావించబడుతున్నది. ఇది 37 అడుగుల పొడవూ, 20 టన్నుల బరువూ కలిగి ఉండేది!



## వేడినీటి బుగ్గ



అమెరికాలోని ఎల్లోస్టోన్ నేషనల్ పార్కులో — ప్రపంచంలోకెల్లా మరుకైన 'ఓల్డ్ ఫెయిత్‌ఫుల్' అనే వేడినీటి బుగ్గ ఉన్నది. ఇక్కడ 66 నిమిషాలకు ఒకసారి 140 అడుగుల ఎత్తు వేడినీటి బుగ్గ ఎగజిమ్మబడుతున్నది.

Sandak

Sandak

EVEN THRICE A YEAR.
WITH LOVE





WE WANT
SANDAK





SANDAK
everytime

Mothers love Sandak,
because Sandak is made
from pure Chemilon*. Safe, affordable,
versatile, durable Chemilon.
And because children
love Sandak, too!



Sandak

For all times

/Bata—S/3—87

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



V. Muthuraman



V. Rajamani

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ముందుకు పోవడం ముఖ్యం! రెండవ ఫోటో: అందుకు అవసరం సఖ్యం!

పంపినవారు: కు. మణిమాదల, రజోరీ గార్డెన్, న్యూఢిల్లీ–110 016

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


### చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

A Super treat in every sweet!

# SUPER SIZE! SUPER TASTE!




nutrine

## SuperStar

Premium toffees









TWIN TREAT
DELITE
TOP CREAM




Heavenly delights



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్ముడయ్యే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రై. లిమిటెడ్, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్

CLARION/NC/8636

కష్టేఫలే అన్నారు,చదూమరి.కష్టబడి చదివితే,
స్కూల్లో ఫస్టు,ఇంట్లో రస్నా టేస్టు!

రస్నా

జల్రా సారింజ రుచి!బలే మజా!






భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ కాన్సంట్రేట్

తయారుచేస్తున్నవారు: పయోమా ఇండస్ట్రీస్, నరోడా, అహ్మదాబాద్ 380 016

Mudra:A:PI:3356:TL